శ్రీ

# లక్షణాపరిణయము.

---

## ప్రథమాశ్వాసము.

ఉ॥ శ్రీమురళీరవంబు రుము సిద్ధహిరణ్మయ చేలకాంతులు
ద్ధామతటిల్లతావళులు దారతనూరుచి వార్షికాంబుము
ద్ధామముగాఁ దలంచి తమకంబున వెన్నాని నీలకంధర
స్తోమము రాఁ గరాగమున శోభిలు కృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్.

చ॥ వసుమతి యంచు నెంచెదు కుభామినిఁ జూడక నీరుదండనా
దుసవతిఁ దాల్చి తీవెలమితో నసుమంగళదేవత న్భవ
ద్వసతినిఁ జేర్చు మంచు ధవువక్షము వాసముఁ జేసికొన్నప
ద్మసదన మాకొసంగుత సమస్తసుఖస్థిరసంపదల్కృపన్.

ఉ॥ గంగ నిజోత్తమాంగమునఁ గైకొని కూరిమి జాలునాఱనే
భంగిననుంగనుంగొనవు పార్వతి నేగిరిశుండ వీవె య
ర్ధాంగమునం గ్రహింపఁదగ నాయని పల్కెడి సర్వమంగళం
బొంగి కవుంగిలించు శశిభూషుఁ డిడు న్సకలార్థసిద్ధులన్.

ఉ॥ చల్లదనంబు చూపులనుజన్గ వగట్టిదరస్మితంబునం
దల్లసితవ్రదీప్తి కటియందు లసత్కటక ప్రశస్తిరం
జిల్లుట శైలజాత వయి చెల్లుదు వంచు వచించు భర్తతో
మెల్లన నవ్వు హైమవతి మేదుర సంపద మాకొసంగుతన్.

ఉ॥ ముద్దియ రూపభేదముల మోదముతోడ నొనర్చి నాఁడ నేఁ
దద్దయు నానిదెంత వివిధస్వరసృష్టి యొనర్తుఁ జూడు నా
ముద్దికయన్న శారద మృదూక్తికి మెచ్చుచుఁ దమ్మిమిద్దెయ
న్గద్దియఁ గొల్వు చెల్వము రునల్వ ననుం జిరజీవిఁ జేయుతన్.

చ॥ చనుఁగవ వీణెకాయ యనుజాలఁదడంబడఁ దంత్రిమీటు వ్రే

ఘృణనునుపైనతీవలుతళుక్కనితొట్రిలగాత్రవల్లకీ
స్వనములు మేళనందనరసారసుధారసమొల్కఁగా నవుం
బొనరుచువాణి నారసనమోదముఁ బూనివసించుఁగావుతన్.

ఉ|| సింధురవక్త్రనామము ప్రసిద్ధివహింపఁగఁ గేళివేళల
న్సింధులఁ బుష్కరాగ్రమునఁ జివ్వనఁ బీలిచిజ్ఞపిష్టమైదయా
బంధురుఁడౌట మామకశుభంబిడ వెండియు నించెనెవ్వఁడా
గంధగజాస్యుఁ గొల్తుఁ గలకాలము విఘ్ననివారణార్థమై.

సీ|| అవనిజగత్ప్రాణహారిప్రభావవిభాసి యావల్మీకభవు నుతించి
లలితఘనకలాకలాపవిలాసభాసురుఁడౌ మయూరుసంస్తుతి యొనర్చి
సరసార్థవర్మమై త్రిసంపాదియైనట్టిశంకరు నెదలోన సన్నుతించి
యంచితానంతశయ్యాకల్పనల చేను దారుఁడైనట్టిమురారి నెంచి
సరసమహిమాతిగరిమానుసారివృత్తి । నిరతిభవభూతిభజియించి నేర్మి వ్యాస
కాళిదాసాదిగీర్వాణకవులమిగులు । వారి నెల్ల రమదిలోన వారిఁ గొల్తు.

సీ|| ప్రథితరామాయణాంబుధికాండవిహరణాయత్తాత్ముఁడే పురుషోత్తముండొ
నలలితభారతైక్షవపర్వరససముజ్జృంభణకారణుండే ఘనుండొ
ఘనభాగవతతరుస్కంధాధిరోహణప్రమదుఁడే విశ్రుతాగమచరుండొ
ద్వ్యర్థిప్రబంధప్రపంచనిర్మాణసంమానితుఁడే చతురాననుండొ
యట్టిభాస్కరు నన్నయభట్టుఁ దిక్క । యజ్వఁ బింగళిసూరన్న ననఘమతిఁ ద
లంచినతులాచరించెదలలితఫణితు । లాంధ్రభాషాకవిత్వమండలరుకొఱకు.

గీ|| ఎఱుకలసడల్చి మృదుపదవృత్తి డుల్చి । బలుజడాశయములఁ దోఁగి పంకజాత
భంగములవీగి నెఱసులుపట్టుకుకవి । నికరమెనయు నెసరసులనిక్కువముగ.

గీ|| ఇష్టదేవనమస్కృతిశిష్టజనపు । రస్కృతినిదుష్టకవులతిరస్కృతినతి
భక్తియుక్తినొనర్చిప్రబంధరచన । మోదమిగురొత్తుచిత్తముప్రోదిసేయ.

క|| ఏమహనీయచరిత్రముఁ । బ్రేమమునం గూర్తు ననెడివృత్తిము కుంద
స్వామిపదతామరసయుగ । ళామిళితమహామనస్వినై యెంతేనిఁ

సీ|| ఏదేవుకందోయి యెన్నమన్నన బావత్రిజగత్పరీవృతతిమిరమునకు
నేదేవుపద్రజంబీ ధాత్రిలో ధాత్రిశాపతప్తాహల్యరూపమునకు
నేదేవుసాధనంబాదికస్యాఘాతసమరహతాసురజాతమునకు
నేదేవు నామంబు హితవైద్యుఁ డమితపరీతాపయుక్తసంసృతిరుజలకు

నతనిగోసలకన్యకావితతగర్భ । శుక్తిముక్తామణిలసద్వసుంధరాత్మ
జాపతిదయారసాబ్ధిదాశరథి నెలమి । వెలయఁగొలుచుచు నేనున్న వేళయందు.

క॥ పలవింపనేల శ్రీకృ । ష్ణలలనమైనట్టిలక్ష్మణాపరిణయమి
మ్ములఁజేసి మాకుఁగృతిని । మ్మలరారెదవీవుమద్దయారసదృష్టిన్.

సీ॥ అనునట్టులోకయులివాలించి రామమహత్త్వంబు గామదియందుఁగ్రుచ్చి
పిచ్చుకగుంటుపైఁ బెల్లుగ వెల్లివిఱియుగంగభంగినిఁబ్రీతినచ్చి
గాఢాంధకారానఁగన్నుఁగానని వానికినుదయముగ నియ్యెడకువచ్చి
యాడఁబోయినతీర్థమదెయెదురైనట్టులఖిలషితార్థంబు నానతిచ్చి
చనెననిపిపాసితునిపై జలదవృష్టి । మాదిరినిదప్పిఁగొనినిరుపేద పెన్ని
ధానముసుగన్నగతిఁబ్రమదంబునంద । లంచి నేమెంచికలతచాలించి నేను.

మానిని॥ అంతనిరంతరకృత్యములేర్పడ నన్నిటిఁదీరిచి విస్తృతవే
శ్మాంతరసీమ నెసంగవసించి మనోధిగతంబగు దైవమహో
దంతమునంతయుఁదెల్పితి మేలివిధానసగోత్రులు మిత్రులు ధీ
మంతులు శాంతులు నాదిగ భూసురమాన్యులతోడఁబ్రశాంతగతిన్.

ఉ॥ వారలు నాపయింగృపయపారముగాఁ బొడసూపి లోనఁ బెం
పారఁదలంచి దాని శుభమానిది చాలశుభస్య శీఘ్రమం
చారసియార్యులెల్లరనరాయవు రా భవదీయభాగ్యమి
ద్ధారుణి శౌరినారికృతి తత్పతిరాఘువుఁడించుపంటసూ.

శా॥ జాలంబేలమహానుకూలతఁగనం జాలెన్న లీలంగృపా
వాలున్రామునిభర్తఁగూర్చి కృతిఁగల్పస్థాయిగాఁగల్పనా
లీలంజేయుము నీవు రాముకరుణాలేశంబున న్శాశ్వత
శ్రీలంజెందుదు నిన్ను నెన్నఁదర మేశృంగారకవ్యన్వయా.

సీ॥ శృంగారకవినామ శృంగారవంశంబు పేరుసార్థకమందఁ బెరిగినాఁడ
వమలప్రబంధపాకముగ ముకుందశతకముఁగవితాప్రౌఢిఁదార్చినాఁడ
వెంతయుఁగృతిఁబుష్పదంతరచితమహిమ్నస్తుతినిఁదెనుంగొనర్చినాఁడ
విలశంకరాచార్యకృతశివానందలహరినంధ్రభాషఁదనరచినాఁడ
వతులనుతుల్లుమల్లేశశతక మొకటి । జతపఱచినాఁడవుభయభాషాసమాన
నిశితసాహిత్యకవితాతివిశదమూర్తి । వేతదీయకృతి యొనర్ప నెంతసేతు.

శుభమస్తనపుఁడు రామ॥ పభుఁడేకలఁడనికడంగిప్రస్ఫుటకవితా

విభవముఁగొనిమద్వంశం।బభివర్ణించెదను నేబుధాభిమతమునన్.

సీ॥ ధీరులుధరణీధ్రధీరులుప్రథితసుధీరులుమంజులాధీరులమిత
సారులున్యాయానుసారులుకరుణాప్రసారులుదైవతసారులుగుణ
హారులుదివ్యవిహారులువైరిప్రహారులుమణితారహారులునధి
కారులుదర్పకాకారులుశ్రితశుభకారులుహృతహృద్వికారులుశ్రుతి
చారులధిగతతత్త్వవిచారులుభృత । ధీరులంభోధిరాజగంభీరులత్యు
దారులనురూపసుకుమారదారులగుచు । నుర్వినార్వేలవారుచెల్వొందిరందు.

సీ॥ అష్టాంగయోగవిశిష్టాంకురశ్రేణి కేరాజయోగి కేదారమయ్యె
బ్రహ్మాండకుక్షిగర్భంబున కేమహామతిప్రముక్తాగ్రగణ్యతవహించె
గోత్రజాతాభీష్టధాత్రీరుహములకేచిత్రప్రభావుండుచైత్రుఁడయ్యె
నచ్ఛిన్నయానందనరసికేపరమహంసావతంసమురాజహంసమయ్యె
నట్టికౌండిన్యమునిమాన్యునధికపుణ్యు।శాంతజితమన్యుసంన్యాసతానంతమన్యుఁ
బరికలితవన్యున్యుతధృతపాంచజన్యు । సన్నుతులొనర్పఁదరమెలనన్నుతులను.

శా॥ తత్కౌండిన్యపవిత్రగోత్రమునసద్వృద్దుగ్ధపాథోనిధి
స్వత్కాంతాప్రభుభాతినుద్భవిలెభాసవేంకటాఖ్యుండుశ్రీ
మత్కల్యాణగుణాభిముఖ్యుఁడుసుధీమత్ప్రాజ్ఞసఖ్యుండుదీ
వ్యత్కల్పాచ్యుతతల్పరుద్రదరకల్పశ్రీసమాఖ్యుండనన్.

గీ॥ వేంకటేశ్వరుఁడుతనదుపేరుసార్థ।మందలక్ష్మీప్రియుఁడుచతురాస్యగురుఁడు
విబుధజనతాదరుఁడుఘనాభిరుచిమూర్తి।మిత్రమండలవాసినామెలసెధరణి.

క॥ ఆవేంకటేశ్వరుఁడుతన । దేవిగలక్ష్మిఁగొనుటెంత తేకువయనితా
నీవేంకటేశ్వరుఁడుతన । దేవిగలక్ష్మినొనరించి తేజంబందెన్.

క॥ చతురాస్యాకృత్యతనుల।సుతులంబున్యాజనదానశోభితుఁబలివి
శ్రుతవంశవార్ధిజనన । స్థితిఁగనుటనులక్ష్మియనఁగఁజెల్లదెయామెన్.

గీ॥ మోసలలకేఁగిలాఁగమైమొలయువాణి । మగనినగమంగసెంగనెక్కెనెగడుదుర్గ
ప్రతిగృహంబునుదిరుగుచుఁబగలుగూర్చు । పద్మమందిరలచ్చమాంబకునవతులె.

క॥ కనెవెంకననసర్వనలిం । గనబాపనఁబల్లయంబ్రకాశిలనావేం
కనలక్ష్మాంబికయందున్ । ఘనతరదుగ్ధాబ్ధికల్పకంబులపోల్కిన్.

సీ॥ సకలేష్టఫలదానసంపదనల్పసంకల్పంబుచెలగుటఁగల్పకములొ
కుసుమకోమలధర్మగుణసమాయోగంబుమలయుటమన్మథమార్గణములొ

యార్యాభిముఖ్యకళాధరసక్తిఁ జెల్వొందుటఁ జంద్రచూడాననములొ
సంతతాశ్రితసుదర్శననందకాద్యభిఖ్యలు వెలయుట నచ్యుతాయుధములొ
వతతశ్రీహరిసాహాయ్యశాలులవుట । నరయఁ బాండవులో యననవనిలోన
వారలేవురు నీరము క్షీరమువలెఁ । గలసిమెలసి చెలంగిరి కలకలేక. ॥అందు॥

సీ॥ ఏకవిలేఖనాప్రాకట్యగ్రంథముల్గజపతికిం దలగరువమయ్యె
నే శేముషీశాలివైశద్యభాషలు హరిపతికెడఁదనబ్బురములయ్యె
నే కలాకరుకవితాక్రమకలనంబు నరపతికినిసభాభరణమయ్యె
నే విచక్షణునిభోగాభోగవిభవంబు సురపతికిని నేత్రశుభగమయ్యె
నతఁడు వేంటమంత్రి విశ్రుతమతిప్ర । భావదేవేంద్రమంత్రిభావ్యసరసోక్తి
సారతరశక్తినయయుక్తిసాధురక్తి । ఁజక్రిభక్తి నివినయప్రసక్తిఁ జెలఁగు.

మ॥ ఘనశక్తిం బ్రకటింపదివ్యశతకగ్రంథప్రబంధంబులెం
చినభక్తిం బ్రచురింపదైవవిలసత్సేవాకలాపంబులొ
య్యనఁ గావించి ప్రసిద్ధిఁ జెందెఁ గవితాయద్యస్తిరాజ్యేనకి
మ్మను నార్యోక్తి యథార్థమౌనటులఁ జేయ న్వేంకటాఖ్యుండిలన్.

క॥ సకలకలాకరశేఖరుఁ । డకలంకుఁడు సర్వమంగళాస్పదుఁడల తా
రకనామమంత్రఘనదే । శికుఁడైన సర్వేశ్వరుఁడు ప్రసిద్ధింబడసెన్.

క॥ కౌసల్యాసూనుఁడు సీ । తాసతిఁ జేకొన్నవాసిఁ దత్పరతన్సీ।
తాసీమంతినిఁ గైకొనె । నాసర్వనసచివుఁడసమహర్షరసమునన్.

క॥ క్షితిక్షమను శుచినిజాహ్నవి । పతిభక్తి నిసీత మతినిభారతిత్యాగ
స్థితినన్నపూర్ణరూపున । రతిప్రతియన సీతమాంబరహినుతికెక్కెన్.

క॥ విశదంబుగ సీతాసతి । కుశలవులం గనినరీతిఁ గుశలులసీతా।
శశిముఖిసుతులం గనెశుభ । వశగయశులవేంకటాఖ్యుఁ బల్లయమంత్రిన్

సీ॥ సారకీర్తినిజంద్రుసాటిసేయఁగవచ్చునసితకళంకంబు నందఁడేని
బుద్ధిచే బ్రహ్మను బోలింపఁగావచ్చు మఱపు నొందకసృష్టిమసలెనేని
వితరణంబున ఘనుజలఁ గూర్పఁగావచ్చు మలలుబట్టకయూరమొలఁగెనేని
నైశ్వర్యమునఁ బ్రమథేశ్వరుఁ బ్రతియనియెన్నవచ్చును భిక్షమెత్తఁడేని
యతులకారుణ్యమున విష్ణువుతులవచ్చు ।బలినిద్రోహంబు సేయకప్రబలెనేని
యనుచు నుతిఁ గన్న యాపల్లయాభిధానుఁ ।డుభయభాషాభిమానుఁడింపొందుచుండు.

చ॥ నరకృతి సేయరాదనుజనశ్రుతిగా, భగవత్పదాంకితం

బరసి మొనర్చె నైకశతకాదికముల్ రచియించి యాశుబం
ధురఘటికాశతగ్రథనధూర్వహుఁడన్బిరుదందె సిద్ధమి
ద్ధరణినిఁ బళ్ళయాహ్వయుఁడు దారకవిత్వవిభూత్యనంతుఁడై.

క॥ ధరణిం బళ్ళయమంత్రీ।శ్వరుఁ డిరువుగ రామమాంబఁ బరిణయమయ్యెం
బురుహూతుండు పులోమజ।బరమాహ్లాదమునఁ గరముఁ బడసిన కరణిన్.

సీ॥ ఎనసేయనగు నహల్యను శిలగాక పాతివ్రత్యమహిమతోఁ దిరిగెనేని
తులసేయవచ్చు ద్రోవదిఁ బంచభర్తలు లేక సన్మతి మెలఁగెనేని
జతసేయవచ్చు జానకీసతిఁ బతి నెడఁబాసి యడవులనడలదేని
సరిసేయవచ్చు సురుచిరారుంధతి హీనవంశోత్పత్తి నెనయదేని
సమము సేయగవచ్చు జహ్నుసుతను। వక్రగతిపంకపద్ధతుల్వదలెనేని
కొఱతలుండినవారలీ తెఱవ లెనయె। భవ్యమతి పేటి రామమాంబావధూటి.

మ॥ పరమప్రాభవులందనూభవుల నాపళ్ళయ్యమంత్రీంద్రుఁడి
ద్ధరలో నిర్వుర రామమాంబవలనన్ ధారాళసంచారత
త్పరులన్ సుస్థిరకీర్తులం బడసె నర్వారాయని న్వేంకటే
శ్వరు, హేరంబుఁ గుమారునిం గనిన శర్వస్ఫూర్తి వర్తించుచున్

క॥ వారిరువురిలో నేస। ర్వారాయసమాహ్వయంబుఁ బడసినవాఁడన్
శ్రీరామపరిస్ఫురితకృ। పారసకరణప్రచారపారీణుండన్

సీ॥ జిలుగుదుకూలంబు వలువలు దాల్చి కర్కశమైన నారచీరలు ధరించి
చంద్రశాలాంతరస్థలముల శయనించి పర్ణశాలలయందుఁ బవ్వళించి
భూరిశాల్యోదనాహారంబు భుజియించి యలకందమూలాదులారగించి
హస్త్యశ్వయానసమారోహణ మొనర్చి యంఘ్రియానక్రియ నాచరించి
సేవకావళి పరిచర్య సేయఁ బ్రబలి। యతిసమర్చనతా నెసంతత మొనర్చి
సుఖము దుఃఖము తనకొక చొప్పుఁ జూప। భువనమువనమ్ము నేలు రామవిభుఁడపుర..

సీ॥ అఘటనఘటనా మహాపటిమకు నీళ్ళపై ఱాళ్ళఁ దేలించువరుస సాక్షి
ప్రథితమహత్వప్రభావానుభూతికి ఱాతి నాతినొనర్చు రీతి సాక్షి
సర్వసమానప్రశంసకు శబరీభరద్వాజకృతసమర్చనమె సాక్షి
శరణాగతత్రాణశక్తికి వాలిశిక్షణము సుగ్రీవరక్షణమె సాక్షి
పరమకారుణ్యవృత్తికి సురలకొఱకు। నరవినవతారమెత్తుట సాక్షి గాఁగ
రక్షణమొనర్చు నిలను దారక్షణమున। రాముడి భుఁడు ఘనాభాభిరామవిభుఁడు అట్టి॥

క॥ శరదారహారశారద । శరదామరకరితుషారశతధారవిభా
స్వరకీర్తినిదానునకు । స్వరదానునకున్ ఖలప్రవరదానునకున్

క॥ వాసితమల్లీసుమనమ । హాసునకుహృతద్విషన్మహాసునకుజయో
ల్లాసామోధ్యానగరని । వాసునకుంగాంచనప్రభావాసునకున్

క॥ అతిసౌందర్యప్రహసిత । రతిపతికినిశేముషీతిరస్కృతవరభా
రతిపతికినిన్యాయావన । రతిపతికినిరాజమౌళిరచితవినతికిన్.

క॥ రామునకువిజితభార్గవ । రామునకునిరంతరేతరామునకుగుణా
రామునకుశాత్రవాళివి । రామునకుసతీమనోభిరామునకెలమిన్.

గీ॥ అర్పితంబుగ నేనునొనర్పఁ బూని । నట్టిలక్షణాపరిణయ మనెడిబంధు
రప్రబంధంబునకునుగథా ప్రపంచ । మెట్టులన్ననువివరింతు నెల్లఁదెలియ.

సీ॥ రజితాద్రివలెఁగుమారక శివాభృంగీశ్వరగణాభిరామమై ప్రతిభ మెఱసి
వైకుంఠమునుబోలివైజయంతీమాధవమదనలక్ష్మీక్రమమునుబడసి
యమరావతివిధాననైరావతసుమనశ్శక్రమందారసంస్పర్శఁదొరసి
యాకాశముంబలెనతిమాత్రజీమూతలసదృక్షహరిమండలంబునెనసి
కౌశికాగస్త్యశాండిల్యగాలవశుక । పిప్పలాదాసమైఋషివిలసనంబు
వలెమహారణ్యములలోనవాసికెక్కి । పుణ్యగణ్యమునైమిశారణ్యమొసఁగు.

సీ॥ పరమద్విజశ్రుతిభావ్యవాక్యములట్లద్విజరాజివాక్యములెత్తి జరిల్ల
నరివర్గరహితయోగరతయోగంబట్లజంతుసంతానంబుసంతరిల్ల
రమ్యహోమాగ్నిహోత్రజ్వాలలట్లదవదహనజ్వాలలుప్రజ్వరిల్లఁ
బ్రసవకిరియాధూమపరితసౌరభమట్లప్రసవసౌరభములుపరిఢవిల్ల
నిరతయోగనిరుద్ధపునరుపసారి । మారుతంబట్లపవనంబుదారసిల్ల
సకలజనమానసానందసరసరణి । నెల్లనైమిశకాననముల్లసిల్లె.

అందు॥ గీ॥ నిత్యజపహవనాదిసత్కృత్యములయ । ధార్మ్యవిధిఁదీర్చిమౌనులుసావధాన
మానసంబులశ్రీహరిధ్యానమునఁగు । శౌననాసీనులైయున్నయవసరమున.

చ॥ మనమిలలోనఁగల్గినరమాధవుసత్కథలెన్నియేనిభా
వనమొనరించినారమనినారితభక్తిరసానుయుక్తిచే
తనుదనివందదయ్యెమదితామరసాక్షుమహత్వమెట్టిదో
యనఁచుఁబరస్పరంబుఘనహర్షరసాంబుధిఁదేలిలీలమై.

గీ॥ మౌనిసంతానమానసయజ్ఞానలసద । మానసుగుణనిధానునిశౌనకాఖ్య

ధానునిఁబురస్కరించుకదనరిమృదుల । శుంభదారంభవాగ్గుంభజృంభణమున.

చ॥ నిఖిలపురాణవైఖరులనేర్పుగలాఁడవు నీముఖంబున
న్ముఖమయినిల్చెవాణి నినుఁబోలినవారలు లేరు నిర్జితా
ద్యఖచయ?లక్షణాపరిణయంబువినంగలదిచ్ఛ మాశ్రవ
స్సుఖమొనరింపుకూరిమిని సూతలసద్గుణజాతనాపుడున్.

చ॥ ననుఁగడుఁబెద్దఁజేసికరుణారసమొల్కఁగఁబల్కుటింతె కా
కనవకథాళిమీకెఱుక కానిదొకండునుముజ్జగంబులం
గనఁగొనలేదు నానుడులుగావినఁగోరికగాకతారుపెం
చినచిలుకెట్లువల్కనరుచించునకాదెజనాలి కెల్లెడన్.

చ॥ చనువునమీరుకోరుటలెచాలును దేవరయానయిచ్చినం
బనుపడనేర్చిచెప్పననవచ్చునె? యొప్పులుదప్పులైనవ్యా
సునిచరణారవిందములఁజూక్కిభజించిహరిన్ స్మరించినా
మనమునఁదోచురీతిననుమానములేకనువిన్నవించెదన్. వినుండి

ఉ॥ తాకుఘనాళికప్పులిడితా భువనంబులవృద్ధిఁజెందిర
త్నాకరుఁడయ్యె నెల్లెడమహార్ణవసంజ్ఞనుసంగ్రహించియా
హాకడుభంగముల్బడసెనబ్ధిమహాజడధీశుఁడంచుము
ల్లోకములాఁడనాడుమొదలుంజడధిప్రథితాఖ్యచూడుఁడీ.

సీ॥ వాహినీశుండయ్యె వరశరధిఖ్యాతినిఁగనిశరోపయుక్తిఁగనఁడయ్యె
ఘనులకప్పులొసంగికడభంగసంగతిబొందినంతతముసముద్రుఁడయ్యె
రత్నాకరుండయ్యె రహివరాటకసంగ్రహముగల్గఘనకబంధాశియయ్యె
గంభీరుఁడయ్యె జక్కజడచరుల్గన్నుగుజివెట్టఁగానతిఘోషియయ్యె
నేమహావిక్రమక్రమంబేయుదార । వృత్తియేగౌరవస్థితియేస్థిరత్వ
మద్దిరాయనినేర్పరులాడుచుండఁ । దనరెసాగరతలమువిస్తారజలము.
తన్మధ్యమభాగంబునందు॥

సీ॥ గారుడమణివిటంకములఁగన్గొనిపచ్చికనిహారి తేరివాహములుమ్రొగ్గఁ
గాంచనవప్రంబుఁగాంచినిర్జరపాళి హేమాద్రియనివిహారేచ్ఛడిగ్గ
శరధిపరీవృతవరణంబు మైనాకగిరియనిహరిచే భిదురముఁబూన
జిగిగోడపైఁగలమగరాలసింగముంగనివేల్పుటేనుంగుగంపమంద
రత్నసంబద్ధకుట్టిమశ్రీజినూత । నారుణాబ్జకల్హారకాసారమనిసు

రాపగానంచరద్భ్రమరాళి రాఁగ । ధరణి మెఱయును ద్వారకాపురవరంబు.
క॥ ఆపురము రాజ్యరమకుం । గాపురము వసుంధరాంఘ్రికమలోదంచ
న్నూపురము సాలచుంబిత । గోపురము చెలంగె రత్నగోపురమగుచున్.
సీ॥ ప్రమథేశువామభాగముఁబోలె నాగరాజిసమాశ్రితంబయి శ్రీపతియెద
వలె వనమాలికాభ్రాజిమై నందనంబుకరణి సంతానపూర్ణమైను
కావ్యంబుకైవడి దివ్యశబ్దార్థార్థ్యలంకృతి ఘనమై శశాంకబింబ
మట్ల కళావాసమై యంబుధిపగిది వాహినీయుతమై నభంబుపోల్కి
రాజహంసాఢ్యమై యమరావతిగతి । నవసుధర్మాన్వితమయి పుణ్యజనభీక
రంబు పుణ్యజనశ్రీకరంబు నగుచు । మఱియునప్పురవర మొప్పు నెఱిదలిర్ప.
క॥ మెరియుదురప్పురినిఁదమో । హరులుం జైవాతృకులు మహత్సకలకలా
కరులును సత్పథసంచరు । లరయఁగ సర్వజ్ఞమౌళులగు ద్విజరాజుల్.
క॥ మారులు సౌందర్యమునఁగు । మారులు భుజశక్తి నవనమారులు జితభీ
మారులు ప్రధనంబునసుకు । మారులు వెలయుదురు రాకుమారులు ప్రోలన్.
ఉ॥ రాజసమాఖ్యయక్షపపురందరచంద్రులయందుఁ గాంచిత
భ్రాజితవిత్తవైభవచిరత్నసమజ్జలఁ గెల్చి ప్రోలిలో
రాజులు చిన్నబుచ్చుట బిరాన నెదిర్చి చరించిరోటమి
భ్రాజిలి భిక్షుకాను చరినాశతమన్యువు నాఁగ శంకినాఁ.
చ॥ ధననిధులున్నయందుకుఁ బ్రధానవిధానములైన రెండు సా
ధనములు వాల్చుభోగమును దానము వీనివిధంబటంచు శ్రీ
మనకును లెక్క తొమ్మిదినిధుల్ గద మేలని దానభోగది
వ్యనిధుల నేకముల్ గలిగి వైశ్యశిఖామణులొప్పి రప్పురిన్.
చ॥ బలుఁడు హలంబె తాల్చె వృషభంబొకటీశుఁడు గూర్చుకొన్నవాఁ
డిలయలమూఁడు పాదములె యెన్నుక కొల్చెను నామనుండు వీ
రలవ్యవసాయ మెట్లనిని రాకరణంబొనరించి ప్రోలశూ
ద్రులు చెలువందుచుందురు నిరూఢిని బాహలభద్రవృద్ధి చేన్.
సీ॥ సంగరస్థలమున శంకరుండెదిరిన శస్త్రాస్త్రములనొంపఁ జాలువారు
సింగంబు చెనకినఁ జెచ్చెరనసహాయశూరతను మసి పోఁజూపువారు
కులశైలములనైన బలిమిమై దండనెపిండి గుండలు జేయుచుండువారు
బిట్టూది పారము ముట్టంగడలి నొక్క పెట్ట దాటఁగ సమకట్టువారు

దుర్భరాశనిపాతసందర్భమైనఁ। జేతఁజిమ్ముచుఁజనినిల్చి సేయువారు
వీటబాటిల్లుచుందురెచ్చోటఁగనినఁ।గోటులకొలందిపోటరుల్పాటిదక్కి.

మ॥ వరగండచ్యుత దానధారఝురిభాస్వద్బృంహితంబుల్పయో
ధరగర్జానినదంబులన్మకరికాద్రాఘిష్ఠహస్తప్రభా
భరము న్గైరికధాతురాగమురుకుంభశ్రేణి శృంగాళియై
చరనీలాద్రులమాద్రి దంతితతియంచన్గ్రాలఁబ్రోలందగున్.

ఉ॥ వాహసమూహమప్పురి వివాహగతిన్విహరింపఁగాంచియు
త్సాహముతోడనూహఁగొనసామ్యమునొందఁదపంబుజేసితా
మోహటిలంగ గంధవహుఁడొక్కటదేహవిహీనుఁడయ్యెనా
వేహరిణాళియున్గహనవీథిఁజరించెడుఁగ్రింపలేక్షయై.

గీ॥ రాజరాజాధిరోహణభ్రాజితంబ । నంతమణిమండలాద్యతిక్రాంతమతుల
సత్పథవిహారియగుచునచ్చటిశతాంగ। నికరమొప్పారుచుండుఁబుష్పకముపోల్కి.

సీ॥ పరిమళంబబ్బిన బంగారుబొమ్మలు మాటలునేర్చినమణిశలాక
లలసయానములుచెల్వలరెడు వల్లరుల్నిలిచినసౌదామినీగణములు
బహుళద్యుతులుకనుపట్టునైందవకళ ల్రూపుఁజెందినసుమచాపుతూపు
లవనిలోమెలఁగుమోహనదేవవనితలుసరస సౌందర్యరసంబుప్రోవు
లనుచునెంచిచూపఱులాసలందికలఁగి।మోదమందికన్నులనించిమొగముమిప్పి
యొడఁదతడఁబడమోహంబు వడిమునుంగఁ।దనరుదురులీల వారకామినులుప్రోల.

ఉ॥ మేనికడానిడాల్గలసి మించెడుమల్లెలు పచ్చగన్నెరు
ల్గానుదరస్మితద్యుతివికాసముఁగప్పినపచ్చగన్నెరు
ల్జానగుజాజులంచు విటసత్తమచిత్తములంగలంపఁగాఁ
బూనుచుమేలమాడుదురు మోహపడంబురిపుప్పలావికల్.

ఉ॥ ఓసతిఓమ్ముఁగ్రమ్ముకొనియొప్పునివేగదెపుష్పమంజరు
ల్వాసిగఁబాంధనీవెఱుఁగవాయవియాఁబుఱుకంగవచ్చునా
మోనమగున్వరుల్కరము ముట్టుటఁజూడఁగనంచునర్మము
ద్భాసితలీలఁబల్కుదురు పట్టణమందలిశాలిపాలికల్.

ఉ॥ అన్నగరీరమాలలన యందముగాశతమన్యురాజ్యల
క్ష్మీన్నగిథేనువజ్రమణికేతుహయద్విరదప్రకాండసం
పన్నముమాపురీవిభవపాటవమున్సరిచూడుమంచుఁజే

సన్నలఁ బిల్చునట్లలరె సౌధమరుచ్చలకేతుజాలముల్.

చ॥ నిగమములోన భర్మమణి నిర్మితహర్మ్యములందు సుందరు
ల్ తగఁగుమిఁగూడి గానము సతంబొనరింపఁగ నాలకించివ్యో
మగమనమూని మళ్ళితమమందిరసంభ్రమడిగ్గఁ బ్రోవఁ జ
క్కఁగ దరికిన్నరీతతి నగంగనిసోదురు ప్రీడఁ గిన్నరుల్.

చ॥ తరుణులకున్వియోగపరితాపభరంబు భరంబుగాఁగ వ
ల్లరిగతి సౌధవీథిఁ బొరలన్మఱికొందఱుసుందరుల్మహో
దరమున వారిఁ దేర్చుటకుఁ దారొకని సారతరంగిణీపయ
స్సరసిజశైవలాంకురబిసంబులఁ జల్వయొనర్తురెంతయున్.

సీ॥ పురగోపురములుగోపురకర్షణములన్న హర్మ్యవారోన్నతులడుగ నేల?
రాజమార్గంబులెరత్నరమ్యములన్న భవనవైభవములఁ బలుక నేల?
క్రంతలెపరిమళగంధసింధువులన్నఁ జెలులమైపూతలఁ జెప్ప నేల?
శుకపికప్రకరముల్సకలాననములన్న ధీరాధికారముల్దెలుప నేల?
పొదలునుద్యానవనములమొలచులతలె। సౌకుమార్యంబులన్న నచ్చటవసించు
దంపతులచెల్వు వేరతలంప నేల। సంచుమీఱినయప్పురి నెంచిచూడ.

గీ॥ రత్నములఁ బ్రోలిలోమర్త్యరత్నములను। మంజువాణుల ఘనసాలభంజికలను
వైభవంబుల నుత్సవప్రాభవముల। మెచ్చిచూచుట సురలనిమేషులైరి.

ఉ॥ తానుమరుత్తునాఁ బరగి తత్పురినల్లనఁ జేరియుంజగ
త్ప్రాణుఁడనంజరించి తదుదారపరీమళరాశిసాశలం
బూనుటగంధవాహుఁడయిపొల్చినవారలురోసిత్రోయఁగా
లానకభీతిఁ బాఱుట నెయాశుగనామము గాలిదాలిచెన్.

ఉ॥ కాంచనవాసశైసిరికిఁ గాపురమై వనమాలికావిలా
సాంచితమై చిరత్నమణిహర్షదమై ఘనవైభవప్రభా
భ్యంచితమై యుదారపురమాత్మపురంబున భేదమందఁ బా
లించుయదూద్వహుండ సమలీలథ రాజనరంజనంబుగన్.

సీ॥ తనకరనిర్ముక్తదానవార్ధారలుకల్పశాఖలఁ బ్రోదిసల్పుచుండఁ
దనశౌర్యవీతిహోత్రజ్వాలలెల్ల శాత్రవగోత్రవంశసత్రములఁ గాల్పఁ
దనసమాఖ్యాంశుసంతానమాశావధూదారకటిక్షౌమదశవహింపఁ
దనమృదువాక్సారందరసమాధుర్యంబు విబుధోదమునకు విలువఁ దెలుపఁ

దనమహీవహనంబాదిదందశూక । సూకరకమఠకులధరాశాకరీంద్ర
బృందములశిరోభారంబుడిందఁజేయఁ । బుండరీకాక్షుఁడేలునప్పురవరంబు.

సీ॥ శంకరునద్రిసంచారిగానొనరించిసురనిమ్నగనుసింధుసారనొనర్చి
శేషునిబలిపీఠిఁజెందునట్లుగఁద్రొక్కి నాగారిగిరిగుహడాగఁద్రోచి
పుండరీకమునూరుఖండములుగాఁజిమ్మిశశధారికినిక్షీణదశనొసంగి
భారతీసతిసభాభవనంబులకుఁదార్చి నీహారవారంబునీరుఁజేసి
శరముఁదృణభావమునఁదిరస్కరపఱచి । పారదమునిల్వనీయకపాఱఁదఱిమి
సర్వహరిదంతరంబులఁబర్వియుర్విఁ ।బరగెశ్రీకృష్ణమూర్తి కీర్తిరుచివితతి.

సీ॥ విజయప్రభావానువృత్తిచే వెలయఁగ విజయప్రభావానువృత్తి యరుదె?
సద్యశోదానందచర్యచేఁదనరఁగ సద్యశోదానందచర్యయరుదె?
యాభీరహితహృదయాఖ్యచేఁజెలగంగ నాభీరహితహృదయాఖ్యయరుదె?
సరససత్యాతనుసక్తిచేనెసఁగఁగఁ సరససత్యాతనుసక్తియరుదె?
పుణ్యజనదానకరణనై పుణ్యమొదవఁ।బుణ్యజనదానకరణనై పుణ్యమరుదె
యనుచుజనములుజతగూడియతనిదివ్య।చరితములువినుతింతురుచతురఫణితి.

సీ॥ గోపాలమౌళిప్రతాపనిర్జితహేళిరుక్మిణిన్స్వవ్యవహారరూఢినిల్పి
సత్యతోవచనవైశద్యంబునెఱపిజాంబవతికినచ్ఛభావంబుఁజూపి
కాళిందినానరసాళులలోఁదేల్చి మిత్రవిందకుమదిమైత్రిఁదెల్పి
దంతక్షతములుసుదంతకుఁగావించి భద్రకుభావిశుభములుజెప్పి
నిరుపమానందవిహరణనిరతినిరత।మారునొక్కరుగరితలఁజేరిపొరలు
దొరలనీయకకఱిగించిసరస,వారి । నొరసితిరుగుచునెడలేకనొక్కనాఁడు.

క॥ వరమిత్రద్విజసంస్తూ।ద్గురుబుధకవిచిత్రభానుగోత్రోద్భవభా
స్వరకేతుఘనతములఁదగు।సరససుధర్మాసమానసభఁగొలువమరన్.

సీ॥ నారాయణాక్షరపారాయణధ్వనిమీరుటశారదనారదంబో
పూర్ణానుభవపయఃపూరంబులొలుకుటనురుమూర్తిఁదాల్చుపయోంబుధియొకొ
నటనాచటులజటాపటలంబువ్రేలుటజంగమసంతానసాలమొక్కొ;
కరపుటంబునజపసరమంటియుంటనపరబంధుఘోరగాభరణుఁడేమొ
కృష్ణమృగచర్మముత్కటికెలననుంట।నభినవహాలాయుధుండొకోయనఁగభాస
మానుఁడరుదెంచెనారదమానిచంద్రుఁ।డసమహర్షముతోడదైత్యారిఁజూడ.

ఉ॥ దేవమునీంద్రుఁడిట్లుజనుదెంచికవాటమునొద్దనిల్చుచోఁ

గావలివారలాతనినఖర్వతపోమహిమానుభావుఁగా
భావనఁజేసియేమిపనిపల్కెఁడనన్ హరిఁజూచువేడ్కనాఁ
గావినివాసుదేవునకఖండవచస్స్రుతివిన్నవింపఁగన్.
శా॥ దూరంబన్నెదురేగిదేవజటిలుందోడ్తెచ్చిపాద్యార్ఘ్యనము
ఖ్యారాధ్యాభ్యుపచారకృత్యమునమూల్యంబున్నమర్పించెవి
శ్వారాధ్యుండుహిరణ్యగర్భునకుశక్రాద్యాదితేయుల్వలెం
గారామారఁగశౌరియాదరనమస్కారానుపూర్వంబుగన్.
ఉ॥ ఈరుచిరోపచారములనెంతయుఁబ్రీతుఁడనైతినేహరీ
మీరునుబంధుగుల్గురులుమిత్రులమాత్యులుమంత్రులుంజమూ
వీరులుపుత్రులున్వినయవేత్తలుపట్టపుదేవులుంబ్రియల్
పౌరులువేడ్కనీదయినపట్టణమందుసుఖాననుండిరే.
శా॥ ఎంతేప్రేమముమీరఁగాఁబ్రజలరక్షింతేరిపుక్ష్మాధిరా
ట్సంతానంబుజయింతెనిత్యకరుణాసారంబుఁజిల్కింగనీ
క్షింతేబంధులనెల్లసజ్జనులఁబోషింతేధనస్ఫూర్తిఁబూ
రింతేనెక్కటిపోరులందుజయభేరీభాంకృతుల్దిక్కులన్.
క॥ నియమముదప్పనినృపునకు । జయమవునయపథమువిడినసర్వప్రజత
త్రిక్రియసేయుఁగానఁగాదెం । చయథారాజాతథాప్రజాయనవినమే.
క॥ పాపులఁబోఁజోపికృపా । వ్యాపృతిఁబ్రజఁబ్రోచుటవనిపాలకధర్మం
బోపతినావిష్ణుఃపృధి । వీపతియనుబుధవచనమువృథకాకుండన్.
క॥ సంతతమున్యాయదృష్టిని । సంతుష్టస్వాంతుఁడైప్రజారంజనమ
త్యంతంబొనర్పవలెరా । జ్యాంతేనరకంధ్రువమనునార్యోక్తిగలిన్.
క॥ ఘనపథచరివినతానం ! దనుఁడచ్యుతమూర్తిధారినానాగమప
క్షనిధానుఁడవుటచేఁగద । జనపతికివిరాట్పదంబుజగతింగలిగెన్.
శా॥ సప్తాంగంబులసంగ్రహించిభుజతేజంబొప్పశక్తిత్రయిన్
దీప్తోపాయచతుష్టయంబెనయనెంతేసప్తసంతానసం
ప్రాప్తిన్ భూపతియీతిబాధలెడలన్యాయస్థితింభూప్రజం
గుప్తింజేయఁగఁజుమ్మిరాజపదమీక్షోణిన్యథార్థంబగున్.
చ॥ అవనిజనంబుచేతనరినాలవపాలునెసంగ్రహించిసా
ధువులపుబీదబాపలకుఁదొల్తసుఖంబులకిచ్చియర్థిబాం

ధవపరివారసంశ్రితజనంబులఁ బ్రోవఁగనున్న సౌమ్యుఁ దా
నవసరవేళకై నిలుప నౌఁగదబండరువందు నేనికిన్.

కం॥ జనపతికి నతిథిపూజన । మనువవున భ్యాగతిస్స్వయంవిష్ణువనం
జనుగావున స్మృతివచనముఁ । గొనుమీ జనవినుతినిఁ గయికొనుమీ వినుమీ.

కం॥ అనుమునికని యెనువనజా । సనతనయా నీదుకరుణ సర్వము జయమే
మును ఘనభోగాభోగం । బున నుసుఖంబుంటిమిచట ముదమొదఁగదురన్.

ఉ॥ దేవజటాధరాగ్రణి! సుధీవహనా! మిముబోటులమ్మహా
దేవసమానులిట్టులరుదేరుట చేసిరి చేరుగేహము
బావనమానటంచు మును బల్కిరి కోవిదులెల్లఁ గావునం
బావనమయ్యెనో భువనభావన! మా భవనంబుఁ జూడఁగన్.

ఉ॥ ఆరసిచూడ సర్వజగదంతరసంచరులౌట చేతన
వ్వారిగ సర్వలోకముల వార్త లెఱుంగుటయబ్బురంబె మో
పారదసారదేహ! కృపపన్పడఁ దెల్పుఁడు నూత్నసంగతు
ల్వారహి నంత మానిచి ఱునవ్వు ఘటించుచు శౌరికిట్లనున్.

సీ॥ జడచారివై జడచరులనడంచి కమఠమవై కామఠగరిమడించి
భూదారరూపివై భూదారులను జించి నరహరివై నరహరులఁ ద్రుంచి
ఖర్వుండవై మహాఖర్వాఖ్యఁ గాంచి భార్గవుఁడవై తద్ద్విత్రి ప్రజఁ గలంచి
రఘుసంభవుఁడవై నిరఘుఁడనాఁ జరియించి ముసలివై ఘనబలస్ఫూర్తి నించి
ధర్మరాజవయి సతీవ్రతమ్ముఁ గుంచి । కల్కివై యుండి పౌరుషకలన మించి
వెలయుదువు గాదె నీ నేర్పుఁ దలఁచి చూడఁ । బూటపూటకుఁ గ్రొత్త మో పుణ్యపురుష.

సీ॥ ప్రభవవృద్ధిక్షయాపాది వానికిటవసుదేవగర్భసంభవమదేమి
దేవభావంబున దీపించు నీకతిమానుషచర్యలఁ బూను టేమి
గుణనామరూపానుగణనఁ జెందని నీకు గోపకులంబందుఁ గోరలు టేమి
వైకుంఠపట్టణవాసి వానికేమి కాపురంబీ ద్వారకాపురంబు
సర్వమును మోహపెట్టఁ గఁ జాలు నీకు । మోహపాశంబులం బడి పొరలు టేమి
జగము గములు భ్రమింప నట్లగుట కాని । నీదు చిత్రచరిత్ర వర్ణింపఁ దరమె.

సీ॥ అయ్యెడ నియ్యెడ నెయ్యము నరమాచలాభోగభోగంబులందు చుందు
వచ్చోట నిచ్చోట హెచ్చుమై సరసప్రభావి శేషశయనభాసి వౌదు
వందుల నిందుల నందంబుఁ జెందంగ నరిదరకరుఁడవై యలరుచుందు

వక్రుఁడనిక్రుఁడనొక్రుఁటిగా భాస్వదబ్జనేత్రుండవై యమరుచుండు
పటునిటఁగనుంగొనన్నుపత్రానుయాయి । వచటనిచటనువిబుధకార్యాదరుండ
వింతయునిజంబిసుంత లేదంతరంబు । నూడఁగృష్ణాఖ్యఁగన్నవిష్ణుండవీవ

క॥ ఏననొకండువిశేషముఁ । గానంబడ నేను దానిఁగాంచితినత్యా
మానవతీనాయకవిను । మానుగనతిసావధానమానసరణిన్.

గీ॥ ధారుణీతరుణీగళోదారతార । హారగతరత్నసీకాశమధికభద్ర
ముద్రసాన్వితసుగుణసముద్రపౌర । జననివేశము మద్రదేశము సెలంగు.

గీ॥ రాజధానియొకటిదానరత్నగోపు । రంబుపరిచుంబితానంతరత్నగోపు
రంబువిభవాభిభూతచిరత్నగోపు । రంబునవరత్నగోపురమిమ్ముమీరు.

క॥ ఆనగరము నేలుబృహ । త్సేనుఁడుశాత్రవజయప్రదీప్తతరబృహ
త్సేనుఁడుగావునఁదనయభి । ధానముధరలోఁగృతార్థతంజెందంగన్.

గీ॥ ఆప్రభుఁడెసంగెసకలదిశాప్రదీప్త । కీర్తిజిష్ణుఁడుశుచిసమవర్తిపుణ్య
జనుఁడుప్రాచేతసుఁడుప్రభంజనుఁడుశ్రీదుఁ । డీశుఁడనియెల్లరున్నుతియించుచుండ.

సీ॥ తమ్ములఁజిమ్మనికమ్మవిల్తునిమామగోత్రశత్రువుగానివృత్రవైరి
కువలయద్వేషంబుఁగొననిమార్తాండుండుఘనవిరూపాక్షుఁడుగానిశివుఁడు
దరముఁబూననిసుందరరమాధినాథుండుజాతివైరములేనిచైత్రకుండు
భంగసాంగత్యమెనంగనిసింధువుఘనతరాశాఢ్యతఁగననియనిలుఁ
డపురయితఁడనిబుధజనులభినుతింపఁ । దనరెసత్కీర్తిభోగప్రతాపసంప
దవనసౌందర్యగాంభీర్యజవగతులను । బ్రథితగుణపాళిధారుణీపాలమౌళి.

సీ॥ సకలవర్ణితభోగశాలియయ్యునశేషగుణవిలాసంబుచేఁగొమరుమిగిలి
యధిగతనందనుండయ్యునిత్యంబునపారిజాతఖ్యాతిఁబరిఢవిల్లి
ధనదుఁడయ్యుననంతతమువిదూరితకిన్నరశ్రేణియైయుదారతవహించి
జైవాతృకుండయ్యుసంతతమిత్రసమాగమంబుననుబెంపందుచుండి
తనగుణంబులుమిగులఁజిత్రములుగాఁగ । మహినిఁగీర్తివహించెనమ్మహితమద్ర
భూతలాస్థాననిరతప్రభూతధీప్ర । ధానిరుచిరబృహత్సేనధరణిజాని.

సీ॥ ఏపృథివీశుప్రతాపప్రభకునోడిసప్తాశ్వుఁడలమిత్రసంజ్ఞఁజెందె
నేరాజుదానవార్ధారలకెదిరివార్వాహములప్పులపాలుబడియె
నేనృపుకీర్తిసంతానంబుజెనకిపంకేరుహారికళంకియయ్యె
నేపార్థివునిధర్మనైపుణిఁగనిపురుహూతాదులాశాపరీతులైరి

యేధరాధీశు ధైర్యసమృద్ధికడలి । ధారుణీధ్రములచలవృత్తంబుఁబూనె
నతఁడు రాజన్యమాత్రుఁడే యనమనమర । వసుమతీసంశ్రితజయుండు వరగుణుండు.

క॥ ఇన్నరపతిప్రతాపం । బన్నిజగములలమననలుఁడడలిసుమిద్ధ్వాధా
భిన్నంబయిబడబాభిధ । మున్నీటంబడెదవాఖ్యఁబొదవెవనంబున్.

క॥ ఘనతతి దార్కొనఁజాటునఁ । దనరకద్విజరాజునవులఁదవులకదోషా
ప్తినినడఁగకున్ననినుని । య్యనునతులప్రతాపమునకు నెనయనవచ్చున్.

సీ॥ ద్విజరాజులందునుద్విజరాజులందొకచందానసత్కళాశక్తిమెఱయ
క్ష్మాభృత్తులందునుక్ష్మాభృత్తులందొకమాదిరినచలసమాఖ్యదొరయఁ
దరులయందునుమహత్తరులయందునొకయందాననిష్టఫలాప్తిబొసఁగ
శూరులయందునుశూరులయందొకకరణివిశ్రుతఘృణిస్ఫురణమెసఁగ
నారులందునుసుకుమారనారులందు । నొక్కపోలికధర్మసమున్నతప్ర
చారమిరవందనేలునజ్జనవరుండు । పూర్వరాజన్యచంద్రులపోల్కిమించి.

సీ॥ బంధురమదవృత్తిగంధేభఘటలందబంధంబురత్యనుబంధమంద
క్రోధంబసాధువిరోధియూధంబందకామంబుసత్క్రియాస్తోమమంద
లోభంబులుత్సవప్రాభవంబులయందమోహంబుహరికథావ్యూహమంద
వక్రోక్తిహాస్యవాక్యక్రియాక్రమమందవాదంబువిద్యావినోదమంద
విస్మృతులువిశ్రుతవితీర్ణవృత్తులంద । ప్రథితతాపంబులాత్మతత్త్వంబునంద
గానినిజరాజ్యమందెందుఁగాననీక । ప్రజలురంజిలనేలునారాజమౌళి.

సీ॥ విధువిధువిధుభంగివేగంబుమైదూఱువరకరుణాయశోవదనములను
హరిహరిహరిరీతినవరతముగేరుభోగవిక్రమబలాభోగములను
గోపతిగోపతిగోపతిగతిమీరుధిషణాపరిత్రాణదీధితులను
హరిజనిహరిజనిహరిజనిస్థితిఁబోరుసౌందర్యవితరణసత్యములను
భరితభూమీశుదివ్యప్రభావవిభవ । మనుచువిబుధాభినుతిఁగనియతఁడుకొంత
కాలమిలయేలెశాశ్వతశ్రీలఁదనరి । ప్రబలబలవైభవులనాత్మభవులఁబడసి.

ఉ॥ మద్రనృపాలచంద్రుఁడసమానరమానిలయాంబుజాతశుం
భద్రమణీయనిర్మలకృపారసపూరపరీవృతేక్షణుం
డద్రిశిరోవతంసకముమాఖ్యకుమారినిగన్నమాద్రిని
ర్నిద్రకలావిచక్షణఁగనెన్నుతలక్షణదివ్యలక్షణన్.

క॥ ధాత్రీకళత్రుపుత్రిక । ధాత్రీజనభరణభావితస్థితిచేత

క్షత్రేశ్వరసద్రేఖవి । చిత్రంబుగ వృద్ధినొందు చెల్వుం దెలిపెన్.

చ॥ ప్రమదనము ప్రమగుణ్ణుఁడగు బ్రహ్మవిదుం బురుణించుచుం గ్రమ
క్రమమున మాసముల్ పెరుఁగఁగఁ గన్యక దెల్వి ని తెప్ప విప్ప నే
త్రములను మూయు మూకొనును దానక దాఁ జిరునవ్వు నవ్వుఁ బ
ల్కుమటిచు విద్దెమాడఁ దొడఁగున్ నడయాడును లేచుఁ గేరెడున్.

సీ॥ జిలిబిలి నోటిమాటలు పల్కనప్పుడ శారదయను పేరు సంగ్రహించె
నాటపాటలఁ జిన్ననాటి యోటమి కోర్చి సర్వంసహాభిఖ్య నిర్వహించె
బంతిసాగించి విందింతులకిడు నాఁడె యన్నపూర్ణ సమాఖ్య నాదరించె
నుదయించుతటిన సంపదలొదవించుట సర్వమంగళ యను సంజ్ఞఁ గాంచె
నెచ్చెలులకిచ్చు టొక్కంబులిచ్చుటల నె । రుక్మిణియనం గజగతి నిరూఢి మించెఁ
బ్రజను స్వజనము వలె నాదరంబుతోడఁ । గాంచుతటి లోకజనని నామించె బాల.

సీ॥ కుముదనేత్రల కెల్ల నమృతాన్నముల విందులలరించుచో నిందుకళను బోలి
కమలాననలపై నిసుమములు చల్లులాటలయందుఁ గందర్పు ములికిఁ బోలి
కొమ్మలఁ జిమ్మనగ్రోవిఁ జిమ్మెడు నాఁడు ప్రచురఘనక్షణప్రభను బోలి
సుదతులతోఁ బూవుబోదలఁ ద్రిమ్మరు నాఁడు పల్లవించిన మృదువల్లిఁ బోలి
చిత్తరులతోడ నెత్తటినత్తు క్రొత్త । ముత్తెపుం బేర్లు నగలొడ్డి నెత్తమాడి
జయము గొనునంత మరుమాయ చాయఁ బోలి । లక్ష్మణ జెలంగెఁ దన బాల్యలక్షణముల.

శా॥ బాలన్మంజులశీలసద్గుణగణావాలన్ లసద్ధేలనీ
లీలం జాలఁగఁ గేలి సల్పఁగని బల్పేర్మింబునం బిల్చి దా
హాళి న్మేలుగ నంకపాళి నిడి శీర్షాఘ్రాణముం జేసి వా
క్యాలిం దేనెలు చిల్కఁ బల్కఁ దమితో నాలించి లాలించుచున్.

సీ॥ సత్యహరిశ్చంద్ర సంగ్రామరంగధనంజయ దాక్షిణ్యముంజకేశ
దానరాధేయ విద్యాభోజరాజ సాహసవిక్రమార్క శరాసభీష్మ
సౌందర్యకందర్ప సంగీతనారద న్యాయకౌంతేయ భోగామరేంద్ర
ద్రవిణవైశ్రవణ దోర్బలభీమ యైశ్వర్యతరుణేందుమకుట ప్రతాపతపన
గాఢగాంభీర్యజలధి విజ్ఞానజనక । భవ్యశుచివీతిహోత్ర సద్భక్తిదాల్భ్య
శేముషీగీష్పతి వచోవిశేషశేష । యంచు మాగధయూథంబు లభినుతింప.

సీ॥ ఒకచాయ నధికగాయక సముదాయవిధాయక స్తుతి వింతడాయఁ జేయ
నొకవంక నకలంక సకలకలాప్రసంగాంకముల్ నిశ్శంక నంకురింప

నొకచోటఁబటునటీప్రకటాభినయనాట్యపాటవంబొకపాటితేటఁజాట
నొకయోరగీతవారోదారరవముహర్షాశ్రుపూరఁబూరునట్లొనర్చ
నొక్కచక్కటిరాజ్యకార్యోద్యమప్రధానశిక్షాతిరక్షావిధానరభస
సంభ్రమావేశశక్తిప్రసక్తి వెలయఁ । జెలువమగుజాలువామేడఁగొలువుఁదీర్చి.

క॥ నారులమతులతిసూక్ష్మ । స్ఫారంబులుగావునన్విశదకావ్యులస
త్సారస్యమబ్బుటదివెలి । గారముబంగారునకునిగారమిడుటగున్.

క॥ మానిసువుంజదివించెద । మానిసులందెందులేదుమాద్రియనఁగనా
మానసమానందించుఁబ్ర । ధానీపిలిపింపుధీనిధానులననులోన్.

క॥ కొందఱుసన్నుతసాహితిఁ । గొందఱువ్యాకరణముననుగొందఱుకవితం
గొందఱుతర్కంబునమఱి । కొందఱుఛందములయందుగురుమతియుతులై.

గీ॥ పండితాఖండలులువచ్చిమెండుగాఁబ్ర । చండపాండిత్యములుచూపుచుండమెచ్చి
మండలప్రభుఁడశ్వార్థమండనాద్య । ఖండసత్కారములఁగోర్కెనిండనిచ్చె.

క॥ గురునానతిఁగొనినిర్జర । గురుసదృశులుగురులురాచకూతువివేకా
కరమున్సమస్తశాస్త్రని । కరముంజదివించిరంతకరముంగూర్మిన్.

సీ॥ ఇష్టపదార్థములేర్చివాడెడునట్లయిష్టపదార్థములేర్చివాడి
విశ్రుతాలంకారవితతిఁగైకొనునట్లవిశ్రుతాలంకారవితతిఁదెలిసి
యమలక్రియాప్రయోగములఁదనరినట్లయమలక్రియాప్రయోగములఁదనరి
గూఢభావంబులఁగొనునేర్పుఁగనినట్లగూఢభావంబులఁగొనఁగనేర్చి
పాకశయ్యలరచియించుపటిమయట్ల । పాకశయ్యలనలరించుపటిమఁగాంచి
సర్వవిద్యాపరిస్ఫూర్తిఁబర్వెలక్ష । ణాభిధానంబుసార్థకమైదలిర్ప.

క॥ విద్యాభ్యాసంబుననన । వద్యప్రజ్ఞాప్రసిద్ధిఁబ్రబలికడుఁబ్రజా
హృద్యమగుగీతతంత్రీవాద్యంబులయందుఁగన్యభావంబొదవెన్.

క॥ ముద్దులబిడ్డకునబ్బిన । బుద్ధికిమదినుబ్బితండ్రిముద్దిడుకొనిని
బ్బద్ధిగనీసుద్దిఁదలప । నిద్దపుపైఁడికినిదావినిండుటసువ్వే.

క॥ నాకూరిమికూతుర! లో । నీకుంగలకోర్కెఁజక్కనేఁజేకూర్తుం
గాకరమాకాంతునికరు । ణాకలితేక్షణముతోడననుసెడనేఁబోన్.

క॥ ఆనృపుఁడునాకుఁబ్రత్యు । ద్ధానముఁగావించివిధివిధానముగనతి
ధ్యానాసనాదికార్చన । లానందమునొందసలిపెనాసమయమునన్.

క॥ శస్తమొమీరందఱునని । ప్రస్తావముగాఁగనేనుబల్కనయుష్మ

ద్విస్తారకటాక్షస్ఫూర్తి । శస్తమె యనియిష్టగోష్ఠినల్పుచుఁ బ్రభుఁడున్.

సీ॥ ఏదేవమౌనిమహోదారసంచారమాగామిభూతవార్తాళిఁ దెల్పు
నేతపోధనునవదాతదేహద్యుతుల్ చంద్రునకొకవన్నెచాయఁ దెచ్చు
నేమహానీయువీణామృదుగానంబు ప్రస్తరప్రతతిఁ గరఁగఁ జేయు
నేకృపాకలితువివేకదీపిక జనలోకతమంబు నిరాకరించు
నట్టిమహితచరిత్రు నిన్నభినుతింప । వశమె బ్రహ్మాదులకు నైన భావితాత్మ
యస్మదీయశుభంబుల నరయ వచ్చి । తిరిసు ధీరులు సద్దయాకరులు గారె.

గీ॥ స్వామి భవదీయదర్శనస్పర్శనాభి । మర్శననమస్క్రియాద్యర్చ మాదృశులకు
శాశ్వతైశ్వర్యసంపద్యశఃప్రకాశ । సాధనం బవు టాశ్చర్యచర్య యవునె.

క॥ వెదకఁగఁ బోయినలతత । త్పదముల నేఁదగులుకొను విధానంబున నా
రదభవదాగమనం బది । మదనేకభవాత్తసుకృతమహిమంబు గదా.

చ॥ ఇఁక నొకకార్యమున్న యది యెక్కువ యక్కటికంబుఁ బూనిచే
యక వలదయ్య క్రమ్మకరుణాకర మీకెఱిఁగింతు మాకు మా
త్రేఁకు సకలార్థశాస్త్రములరీతుల నేరిమి మీరఁగా నశా
స్త్ర కలితబుద్ధి యయ్యె నల రంగరుణింపుము దారనారదా.

క॥ మానితవీణాగానా । నూనరసానుభవవైభవోదారు మహా
దీననిధానుని నిన్నుం । గానిమొరుం గానము జ్జగాననసంగన్.

క॥ నిత్యాభ్యాసనిశితపాం । డిత్యము గలవారు గీతనిరతిఁ గనరె సా
హిత్యం సంగీతం భా । రత్యాః కుచయుగళ మనుటరంజిల్లెఁ గదా,

ఉ॥ రాజలలామభూజనపురంబుల మాదృశులుండఁగా దుసం
పూజనతోడ మీదృశులు బోలఁగఁ గోరినకోర్కెఁ దీర్పఁ గే
యోజఁ జరింపరాదు సమయోచితరీతి నినీతనూజ సం
యోజితగీతవాద్యవిభవోజ్జ్వలఁ జేయుదు నంచుఁ జెప్పితిన్.

సీ॥ పాలునీరును గూడి జాలువారినగీతి గాత్రతంత్రీస్వరమైత్రి గాలఁ
బచ్చకర్పూరంబు పల్కులో లెక్కడి పోల్కి విప్పగ గీతికలుప్పతిల్ల
ద్రాక్షాఫలాంచితవ్రతతిస్రాకెడు మూడిక్క యాలాపసంపద లావరింప
నైక్షవదండసదృక్షమై పర్వపర్వంబున రాగరసంబు బర్వ
మ్రాకు లిగురింప ఱాలు గరంగ మనసు । పల్లవింపఁగ నమృతప్రవాహ మొలయ
మేను పరవశ మొందఁగ వీనులలరఁ । బాటఁ బాడఁగ నేర్చె భూపాలబాల.

ఉ॥ అంతటఁగన్యచిత్తమునహత్తినబత్తినినిత్తెమెంతో నా
చెంతనునిల్చితంత్రులవిచిత్రతరస్థితిగీతపద్ధతు
ల్స్వాంతముగాఁగనేరుచుటనస్మదనారతదివ్యనామసం
క్రాంతవిపంచికారవముకర్ణపుటంబులఁసోకెఁజోకనై.

మ॥ శ్రుతిసంవేద్యశుభప్రచారిహరియస్తోకప్రశస్తస్తుతుల్
శ్రుతియుక్ప్రమదప్రదంబులగుటన్నొఖిల్లిస్వాంతంబునం
గతమయ్యెంగమలామనోహరునిపైఁగాంక్షింపనెట్లోర్తుసం
మతితోనొండొకభర్తనిట్లయిననాభాగ్యంబుసామాన్యమే.

క॥ మధుపముపద్మమునందలి । మధువుంగ్రోలుటనువిడిచిమదనములకు నే
విధముననేగదో యావిధి । మధురిపుమీఁదిమదియితరమనుజులఁగోను నే.

చ॥ గతజనియందునీశ్వరునిగట్టిగనమ్మితినేసిదానము
వ్రతములుధర్మకార్యములవారిగఁజేసితినేనిదేవతా
హితముగభూసురోత్తములనెల్లభజించితినేనియిప్డునా
పతియగువాసుదేవుఁడనిభావములోపలనిశ్చయించుచోన్.

క॥ వాత్సల్యమొప్పరూపస । ముత్సేకఁగుమారిఁగాంచియుద్వాహవిధా
నోత్సాహంబెదనొదవఁబృ । హత్సేనుఁడొనర్చెధరవరాన్వేషణమున్.

క॥ ఉర్వీచక్రమునంగల । సర్వనృపాలాగ్రసరులసమ్యగ్రూపా
ఖర్వగుణములక్షీశ్రుతి । పర్వముగాకునికిఁజలముఁబర్వియతండున్.

క॥ జలమధ్యస్థలిస్తంభము । మెలపునస్థాపించిచూపుమేరయవధిఁజం
చలయంత్రమునంధించియ । వలమత్స్యముఁగూర్చెవీరభయదారభటిన్.

క॥ విశ్రుతతరశౌర్యరసన । మాశ్రయపార్థివకరగ్రహణసంహరణో
న్మిశ్రమకార్యవ్రజము । ఖ్యాశ్రమసంపాదిశరశరాసములుంచెన్.

ఉ॥ నిర్మలనీరపూరముననీడఁగనుంగొనియంత్రమత్స్యమీ
కార్ముకమెక్కువెట్టిఘనకాండముఁదారిచియొక్కతేపకు
న్నిర్మినిడుల్లఁ ద్రోయుటకునేర్చినపార్థివమౌళికిచ్చినా
కూర్మికుమారిఁబెండ్లియొనఁగూర్చెదనంచునుబూనెఁబూనికన్.

క॥ పాటిలుస్వయంవరంబతి । పాటవముననను చునెల్లపట్టణములఁబె
న్పేటలఁజాటూక్తులతోఁ । జాటన్వాటంబుగభటఘూటముఁబనిచెన్.

క॥ అవ్వలివృత్తాంతంబు । న్నవ్వముదనివ్వటిల్లమాకుంజేజే

బుహ్వకుఁదులయవుపలుక్కుల । జవ్వనఁదెల్పుమని సూతుశౌనకుఁడడిగెఁ

క॥ కరుణావరుణాలయభవ । తరణాతరుణాబ్జపదయుదంచదయోధ్యా
శరణాశరణాగతజన । భరణాభరణారణారిబలసంహరణా.

శా॥ గాధేయప్రథితాధ్వరాధికవిధాక్రాంతక్రియాధ్వంసకృ
త్క్రోధోత్సేధకయాతుధానజలధిద్దోస్తంభరాధేయమే
ధాధాట్యద్భుతదానతృప్తబుధమూర్ధన్యాయధార్థప్రధా
మాధుర్యైకనిధానబంధురసుధామాధుర్యవాగ్ధోరణీ.

మానిని.

సరసిజదళనేత్రాసజ్జనోద్యానచైత్రా । పరమగుణపవిత్రాబంధురాంభోదగాత్రా
ఖరకరజనిమిత్రాకల్మషధ్వంసిగోత్రా । వరమునినుతిపాత్రావైరివల్లీలవిత్రా.

గద్య॥ ఇదిశ్రీమన్ముకుంద పదారవింద మరందాస్వాదనా సాదిత దీపితకవితా వైభవ శృంగారకవి పల్లయామాత్యతనూభవ వివిధకథావిధానాధీనసుధీవిధేయ సర్వారాయాభిధేయ ప్రణీతంబైన లక్షణాపరిణయం బను బంధుర ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము॥

శ్రీరామచంద్రార్పణమస్తు.

---

# లక్షణాపరిణయము.

## ద్వితీయాశ్వాసము.

---

శ్రీరఘుకులాబ్ధిచంద్రా । భూరికృపాతంద్రసారభోగమహేంద్రా
తారాతారశతార । స్ఫారయశోరుంద్రరామచంద్రనరేంద్రా.

గీ. అవధరింపుముసారదుండవలివార్తఁ । బలికినట్టులమునిజనప్రవరుశౌన

కాభిధానుసఁగనుఁగొని వ్యాసశిష్యుఁ । డాయతామోదమున నానతీయఁదొడఁగె.

క. వనితామణిలావణ్యం । బునను సహస్రాంశమైనఁ బొగడఁగ నేఁజా
లనుసరెనహస్రముఖుఁడై । ననుఁ దెలుపఁగలాఁడొ లేఁడొ నందతనూజా.

ఉ. లోలకురంగశాబకవిలోకనకల్పలతామతల్లి గా
బోలును గాని చోనఖరపుష్పములున్ రదకోరకాళి బా
హాలతికాంతరంబులును హస్తకిసాలములిద్ధమార్దవ
శ్రీలువచోమరందము విచిత్రకుచస్తబకంబులొప్పనే.

క. కమలాభిరమతచేనే । త్రములమరెను హస్తములు విరాజిలెఁబదాళి
సమరుచిసిత్రశుతులుశ్రీసా । మ్యముఁగనె భళి యీరమణి రమారూపగదా.

గీ. తరుణిచేతులు భువనజాతములనేలఁ । గనలి కన్నులు కువలయావనము నర్ప
మతిసహింపక పిఱుఁదు జగతులఁ బ్రోవ । నెదిరిచను దోయి చక్రంబు నేదెనదిర.

క. నాగము గెలిచెంగచమని । నాగముఁ గెరలింపనారు నాభియు గేర
న్నాగము గమనముగనుఁగొని । నాగము గెలువంగఁగుచము నాగము గెంటెన్.

క. హరినైమదిమీఱఁగజడ । హరినైమెఱయ నొసఁగంబు హరినైతనరెన్
హరినైనుడులడరనడుము । హరినైతగరూపమెల్ల హరిమయమయ్యెన్.

చ. వరఘనసారతారకప్రవాళశిలీముఖచక్రరంభలం
దిరుగకగల్లహాసభుజదృక్కుచసక్థులగెల్వఁజెల్వకై
శ్యరదశయాలకాళిజఘనాంగవిలాసములీలగెల్చె భా
స్వరఘనసారతారకప్రవాళశిలీముఖచక్రరంభలన్.

ఉ. కన్నియ యాటపోడుములఁ గన్గొని యబ్జసమాచరించెఁబోఁ
గన్నులచూడ్కి క్రేళ్ళురికి క్రన్నఁగఁ గుంగులు దాటిపోయెడుం
జన్నులు సన్నపుంజయఁటనందున దాగెరబూచులాడెడుం
గ్రొన్నన మోవితేనియల గుజ్జనగూడులు విందువెట్టెడున్.

చ. అనుఁగుపొలంతి జంఘముకరాంకవిలాసముఁ జూపమీన కే
తనగతిఁ గన్నులొప్పినను దారనఖంబులు సూనకాండభా
సనెనఁగఁగానసంగఘనసంపదమధ్యము జెందఁజూచియా
ర్షణుబలెఁగావి మోవియలరారెడు నిక్షుశరాసనస్థితిన్.

క. చెలిమిన్నకచప్రిచయము । కలితవినీలజలదంబుగాకుండినని

య్యాలలోఁగలచూపఱకుం । జెలువగుశృంగారరసముఁజలుకంగలద.

క. సుందరిముఖారవిందమ । రందముఁగ్రోలందలంచిక్రందుకొనినయిం
దిందిరబృందముచందము । లందిరసైకుటిలకుంతలంబులుదనరున్.

గీ. పడఁతినెమ్మొగమిందుబింబంబుగాని । యెడలఁజిఱునవ్వువెన్నెలలెట్లువాడముఁ
గన్గలువలెట్లువికసించుఁగచతమంబు । కడకెటులఁబోవువాక్సుధగ్రమ్ముటెట్లు.

గీ. నారితోడ్పాటుఁజెందకనారసములఁ । జిమ్మకనెముజ్జగముగెల్వఁజేయువీని
ధర్మములటంచుఁబల్కుటధర్మమతను । మోహవల్లులుగాబోలుముగుదబొమలు.

చ. ప్రతిదివసంబుపూర్ణతనుభావముఁబొందనిచంద్రుఁద్రోచియీ
నతివదనాబ్జబింబరుచిసంతతిసంతతభాసియౌటవి
స్తృతకిరణాలిఁగ్రోలదరిఁజేరినవెన్నెలపుల్గుజోడునా
నతివలమిన్నకన్నుగవయబ్రపుటందముఁజూపునెంతయున్.

క. సరసిజముఖినాసికభా । సురచంపకసుమముకానిచోసుదృగిందిం
దిరబృందంబుబుశ్రుతికం । దరములదరిఁజేరఁబాఱఁదలఁచునెచెవుమీ.

క. మగువమొగంబుసుధానిధి । యగుటందద్రసమునలువయవలఁదొలఁగకుం
డఁగదుగనొగలందుందగ । బిగియించినముద్రలనఁగవీనులుసెలఁగున్.

గీ. గాలిఁమొక్కుంతసోఁకినఁగడఁకలోఁగు । చంద్రఖండంబుతండంబుచాలఁజేత
నిమురఁగనుమాయునద్దముగమియుఁబెంపు । తళుక్కుగనుకల్కిచెక్కిళ్ళపోల్కిఁగవనె.

గీ. వదనగుహలోనడాగినవాక్పుకంబుఁ । బట్టుకొనముక్కుముంగరవలనమర్చి
మచ్చువెట్టినయట్టిబింబంబుపగిది । ముద్దుగుమ్మకుఁగెమ్మోవిముద్దుమీఱు.

గీ. విద్రుమంబెంతతూఁగినబింబమెంత । ప్రాకులాడినఁబల్లవపటలియెంత
రక్తిఁజూపినమణియెంతప్రతిభఁగనిన । వనితయమృతాధరంబులోఁగొనఁగఁగలవె.

క. తరుణీజనమణివక్త్రి । స్ఫురదరవిందాంతరప్రభూతరుచిరకే
సరవిసరమ్మనరదనాం । కురములుచెలువారువిజితకుందోత్కరముల్.

క. సింధురగామినికంధర । కుంధరశంఖంబుమాఱుకొనిదరపదముం
బంధమ్మనందిమొఱలిడి । బంధురగతివెల్లవెల్లబాఱెంజుమ్మీ.

క. మదిరాక్షిసద్ధిజాంబూ । నదకదళీద్రుమమునందునెయుదయంబై
ప్రిదిలినమృదులదళంబనఁ । బొదలెఁజరమభాగమతివిపులతావాప్తిన్

సీ. స్తనపర్వతస్థలంబునమొల్చుప్రక్కలవిరబాఱునట్టివల్లరులనంగ
రతిషేనకేతనుల్జతగూడియూగెడునూయేలకంబములోయనంగ

వలరాజుకోడెయౌవనదుర్గమెక్కుటకమరిచినట్టిపగ్గములనంగ

సౌందర్యసరసిలోసంభవించినహస్తకమలస్ఫురన్మృణాళములనంగఁ
గచరుచిరమేచకాంబుదనిచయముపరి। తలమునందుండినించినదారలనఁగఁ
గంఠకంబుస్రవన్మౌక్తికస్రజంబు। లనఁగలలితాంగిబాహువులలరుమిగుల.

ఉ. మారకృషీవలుండెలమిమానినియౌవనమన్వనంబున
నిర్మితినాభికాసరసిమెట్టులచేరువమొల్కనాటిశృం
గారరసంబుఁబోసికడఁకంబెనుపందగునారువల్లినిం
పారెడుపూవుగుత్తులనునట్టులుచన్గవయింపుఁజూపెడున్.

గీ. సకియకెమ్మోవిచెఱకురసంబుఁగ్రోల। నాభిబిలమునవెడలిపీనకుచగిరుల
నడుమనల్లనఁజనుదేరునల్లచీమ। బారనఁగమీఱెనారనూగారుసారు.

క. కువలయలోచననాభీ। వివరసరోవరముడిగ్గవిరచించినస్వ
ర్ణవిలాసాంచితసోపా। నవితానంబనఁగవళులునలువొప్పారెన్

గీ. పుడమిఁబంచాస్యదాస్యవిస్ఫురణఁగనియ। నంతసంపత్తినెలకొన్నయమ్మమిన్న
నెన్నడుముసిరిసున్నయుసన్నమునని। యెన్నుచుందురుమాయగాకున్నెచూడ.

క. ప్రాయంపుటేటఁబొడమిన। ప్రాయస్సైకతముసుమ్మిపరికింపఁగనీ
తోయజముఖికటికాదో। యాయతమగుకలువరేకులమరంగలవే.

క. నియతిఁదగుచెలియయూరు। ద్వయదీప్తులనంటియంటిభయమంటిభరం
బయినంతనెవర్ణవ్యా। త్యయమునఁబొరలూడిరంభయననిలఁగూలెన్.

క. చెలిపిక్కలతులకైబా। రలుదలఁపడితునియలైకరఁగిసాగితుదం
దొలిఁజేవలేవడినెయతు। కులఁబడిమొఱఁబెట్టిమొగముఁగ్రుచ్చుకపోయెన్.

క. మదవతిశృంగారసరసి। యదనునఁజెలువందుఁగాననతిముదమునఁద
త్పదమాశ్రయించియడుగున। మెదలెడుతామేళ్ళనాఁగమీఁగాళ్లొప్పున్.

క. గరితకరజరుచినెదురుక। విరిసినహేతువునఁబువులువిరులనుపేరం
బరగెందారలుక్షత్రముఁ। బొరయమినక్షత్రసంజ్ఞఁబొందిచరించెన్.

ఉ. ఆయెలనాగయాచెలువయాలలనామణియాసరోజప
త్రాయతనేత్రయానెలఁతయామృగరాడవలగ్నయావిలా
సాయితమూర్తియాకలికియాచెలియాయలినీలవేణియా
ప్రాయపుఁదన్వినీకుఁదగుభామినికీవునుజోడుజూడఁగన్.

ఉ. సారసపత్రలోచన! విసారవిరాజితయంత్రమేయని
ర్ధారుణినేరికిందరముదారపరాక్రమ! నీకుఁదక్కనీ

హారకుభృత్పయోధరవరాంతరుఁగోరదుగానఁగైకొనం
దీరునటంచుఁజెప్పియదుదేవునివీడ్కొనెహంసవేడ్కపై.

ఉ. ఇచ్చటరాజపుత్రిమదిహెచ్చినప్రేమముతోడనూరుపు
ల్పుచ్చుచుశౌరిఁగోరిపొరపొచ్చెమునాపయినచ్చియుంతకు
న్వచ్చునొరాఁడొయంచుదలఁబచ్చనివిల్దారపొంచిములుకులం
గుచ్చిననోర్వరాకగడుఁగ్రుస్సిమహావ్యథఁదోచకేమియున్.

సీ. ఆతనిబాహులతాయతడోలికనేలతాతన్వియుయ్యాలలూఁగు
నాతనివితతభుజాంతరావాసమందేసతీమణిసుఖవాసమొందు
నాతనినిష్కళంకాంకపాళికనేప్రదీప్తాబ్జనేత్రసుషుప్తిసేయు
నాతనిసుప్రతీకాశ్లిష్టయైయేతలోదరివిహృతిసంమోదమూను
నామెయొనరించువ్రతములునామెసేయు।తపములునునామెయొసఁగెడుదానములును
నామెగావించుపూజలుభూమిలోన।సఫలమౌఁగాదెమిగతనిష్ఫలముసూవె

సీ. శ్రీకాంతుజలధరశ్రీకాంతరూపంబుఁజెన్నారఁగాంచనికన్నులేల
శ్రీనాథురమణీయనానావిధస్తుతివితతులువినలేనివీనులేల
శ్రీధరుబంధుజీవాధరామృతమువిశేషించిగ్రోలనిజిహ్వయేల
శ్రీపతిలలితసుమోపమావయవమ్ముతోనంటరాయనిమేనదేల
శ్రీవరునితోడనిరతంబుభావజాత।కేళికాహాళికాలీలఁజాలఁగలసి
మెలసిచెలువొందలేనియేమెలఁతజవ్వ।నంబదేలంచుజిత్తంబునందలంచు.

ఉ. చూడదుఱెప్పవిప్పిమునుచొప్పనఁజేడెలతోడఁగ్రీడలం
గూడదుహాస్యవైఖరులగూఢముగానెవరెన్నియన్నమా
రాడదుగానమైనఁగొనియాడదుపూనినలోనినెవ్వగ
న్వీడదుపానమన్నమునువేడదువాడదుసర్వవస్తువుల్.

చ. చెలువలఁదాఁచుప్రోలఁదనచెల్వఁడుకన్నులఁగట్టినట్టుచే
తులబయలంటసాచుఁబ్రతిదోచమిలాఁచుఁదనంతనవ్విది
కుఁకలుపలుమాఱుసూచుమఱిగొబ్బునలేచుఁబ్రియంపువస్తుల
వ్వలికినిఁద్రోచుభూషలిలవైచునువేదురిదారివేదనన్.

క. పదఁపడిమదవతులందఱు।సుదతిచరిత్రంబుఁదలఁచిచోద్యంబైన
న్మదనావేదనయొదవెనొ।మదిచెదరెనొతెలియదయ్యెమనకనిగుములై.

శా. నీరంధ్రస్థితిఁగేశపాశముముడిన్విస్రంసింపవానక్తిఁగ

స్తూరీచిత్రకముంచవంశుకలనద్భూషాప్రసూనాద్యలం
కారంబుల్ధరియింపవంచితభవద్గాత్రంబునంజందనో
దారప్రస్ఫుటచర్చ సేయవతిచిత్రంబయ్యెఁజంద్రాస్యరో.

మ. విశదాలంకరణార్థగుంభనరసాభివ్యంగ్యశబ్దక్రియా
తిశయప్రస్ఫుటసర్వశాస్త్రికృతిసందీప్తప్రసంగంబుల
ద్రిశిలాసంచయసద్రసస్రవణతంత్రీమిశ్రసంగీతై
తశతావృత్తులుజూపవైతివినితాంతంబేమికాంతామణీ.

శా. హృద్యంబౌకథలెల్లఁదెల్పుదువుమున్నెవ్వేళనెప్పాళినె
య్యుద్యోగంబుననున్ననెయ్యమునసో హోయాయందు వెంతేమముం
బద్యంబుల్ద్విజపాళికొజ్జవయిచెప్పంబూనుదానీదుధీ
సద్యోగంబదిమాంద్యమయ్యెనిదియేసంరంభమో భామినీ.

మ. తలఁపంజెల్వలమిన్నమారువలవంతల్దాంతులై యెంతొనీ
తలనేవేఁగెనెచెందలేదటెనెలంతల్ భూతలంబందెదం
దలకొన్నట్టిమరుల్దలంచుకొనిచింతంజెందిలోసిగ్గుఁబైఁ
దలఁగంజేయుదుధైర్యమెల్లవిడుదీ దైన్యంబుసామాన్యమే.

చ. చెలియదిగానసర్వమునజెప్పుముప్రాణపదంబువంటిమే
ములలితధైర్యధుర్యులమమోఘనివర్తితకార్యవారభ
రులమనిశంబునీదరినిరూఢిభజింపఁగదాపనేలలో
పలఁగలకోపతాపములఁబాపెదమోపికఁజూపుపాపరో. అని

క. సతులిట్లతులితగతిచే । బతిమాలిననెట్టకేనిస్వకలితచేతో
గతమగునభిమతమంతయు । ద్రుతమతులైనట్టివారితో శ్రుతపఱచెన్.

ఉ. అంతవసంతకాలమునమాత్తరసాలముకౌసుమద్రవా
క్రాంతవనాంతరాలమువికస్వరజాలముపాంథకాముకీ
స్వాంతమహావిదాలముకిసాలలవగ్రసనాగ్ర్యకోకిలా
సంతవచోవిలోలములతాంతచలాలికజాలమైతగెన్.

చ. తమతమయొద్దబీజములధారుణివృద్ధికిఁదెచ్చిమున్నప
త్రములనొసంగియాగడువుదాటినఁజెల్లిడలేమిఁగాలదో
షముఁబొదువంగఁజూచితరుసంతతిగ్రమ్మరధాత్రికాదిప
త్రములనుబాఱవైచుగతిద్రావాలెనిలాస్థలిజీర్ణపర్ణముల్.

చ. అలవనలక్ష్మిఁ దత్పరభృతార్భకబృందములెన్నఁ జేరరా
నలరిచి రానురాగమున నారసి కెంజిగురాకు కెంపులి
చ్చలకోలఁ దీయరో సితనశాఖలు చెచ్చెర మచ్చరింపఁబ
చ్చలగుములిచ్చెనాఁ జెలఁగె శాఖులఁ బల్లవపాళి పచ్చనై.

ఉ. కంతునకున్నితాంతమని కాములతో నవు టెంచి మైత్రిచే
నెంతయుఁ జైత్రుఁ డందు రచియించి సకుంతవితానమొక్కవా
నంతలతాంగి స్వాంతమున సంతసముం గొని నవ్వఁగా ననా
దంతచయంబొ నాఁ దనరుఁ దారొక నికోరకవారకంబొగిన్.

గీ. అతనుసాహాయ్యకమామని చిహ్నంబు | తావిదీవి తేఁటిదాటు విందు
కువలయంబుతోడ వుకుసుమాళి యొల్లచో | నల్లసిల్లెఁ బాలవెల్లిఁ బోలి.

క. తథ్యంబుగ ద్విజతతశ్రుతి| పథ్యములగు భాషణములఁ బలుకఁగఁ జైత్రో
పాధ్యాయుదరిఁ బికార్భకుఁ | డధ్యాపనఁ జేసె సూక్తులతిమధురంబుల్.

ఉ. మానుగ గుజ్జుమావియను మాధవరాజసభాంతమందు మం
దానిలనర్తకుండభినయాదికనైపుణి మీఱ నర్తనం
బూనఁగఁ జేయఁగాఁ గిసలయోజ్జ్వలహస్తముఁ బట్టి కోకిలా
నూనరవానుగానమున నొప్పులతా నటియాడు వేడుకన్.

ఉ. సారతరంపుఁ బూవుటిలుచల్లఁ గదూరి వనీరమాతనూ
దారపరీమళంబను నిధానముఁ గైకొని పోవఁ దత్కుటీ
ద్వారగతద్విరేఫభటవర్గము మారుతచోరుఁ బట్టి త
ప్పారయుచున్న నందెఱిఁగి యాలఁ జనంగనె మందవర్తనన్.

చ. పరమమరందముగ్గునిడి పద్మసరస్సున లాలిఁ బోసి పు
ష్పరజము భూతి వెట్టి సుమవల్లరిడోలిక నూఁచి పెంపఁగాఁ
పెరిగి వనీరమాహృదయవీధిఁ బ్రియంబుగఁ బూవుబంతులా
దరమున నాడుఁ బూబొదల దాగెరబూచులు వాతపోతముల్.

చ. మధురసమాని పైకొనరి మత్తిలి యుత్తరులెల్లఁ జూడనే
విధమున నానలేక మది వేదురి పాటలఁ బాడి చేరఁ బో
బుధతతిమీద రేగి నలి వోయి మధువ్రతపాళి యెంతొ కా
పథమున సంచరించు మధుపానులవృత్తములిట్టులే కదా.

చ. అలవనలక్ష్మి మాధవవధాగమనంబునఁ బూవుబంతిరు

ల్చిలుకలతోరణంబులురుచించుమధువ్రతగీతముల్ద్విజా
వలిపలుకుల్దలిర్పమధువారినిఁదేలికిసాలబాహ్లికం
బలఁదితమాలభూంజనమునందియమర్చెనుగుంపహారముల్.

సీ. హోమాగ్నిఁబొడతేఱుధూమంబునాస్థలకమలంబులందుభృంగములువెడల
విరబాఱుతలఁద్రాలవిధమునఁదరుశిఖరములపైనుండిపుష్పములురాల
ననమవసంతంబులాడెడుకైవడిఁబుప్పొడులెల్లెడఁబొదువుచుండఁ
దగుద్విజులుఫలప్రదానమందినమాడ్కిద్విజరాజిఫలదానవితతిఁజెందఁ
రమ్యనీరాజనక్రియాక్రమముగాఁగఁ । జివురుజొంపంబులెల్లెడసవురుఁజూప
ధరణిఁదరుణీవరాపూర్వపరిణయోత్స । వంబుఁబురుణించియామనిడంబుమీఱె.

ఉ. అంతవలంతికంతునిదురంతలతాంతశరవ్యథాభరా
క్రాంతహృదంతరాశయగుకాంతయుదంతమొకింతనెమ్మదిం
జింతయొనర్చిచెంతలకుఁజేరినెలంతలునవ్యనందనా
భ్యంతరకేలిపాల్పఱచిరావలవంతదొలంగునంచొగిన్.

ఉ. అచ్చికబుచ్చికల్మెఱయనచ్చపుమచ్చికబుట్టముచ్చటల్
హెచ్చుగముచ్చటింపమదియిచ్చజనింపఁగనెట్టకేలకు
న్నచ్చిలతాంగిమెచ్చిజతనంబుననెచ్చెలులెల్లఁగొల్చిరాఁ
గ్రచ్చఱఁబోవఁజొచ్చెఁదమకచ్ఛలవారలుదారులిచ్చుచోన్.

గీ. తారకలలోనరోహిణితారహార । ములనునాయకరత్నంబుభుజగకన్య
లందునసులూచియచ్చరలందురంభ । వలెనులక్షణసెలఁగెనెచ్చెలులనడుమ.

సీ. అవలగ్నసింహంబునరసినివ్వెఱఁబడంబడుమదేభమనమందగతివొదల
రమ్యనాభీమృగగ్రాహిగర్తముఁగాంచియడలుసింగమనమధ్యంబుగదల
ముఖచంద్రరుచికివిముఖమయిమొగయుచక్రములునావక్షోరుహములుదోఁగఁ
జన్నుఁగొండలువీఁగియున్నరాపిడికోడిదొఱలెడిధరణినాఁబిఱుఁదులూఁగఁ
గుటిలకుంతలజాలంబుకొమరుఁజూచి । తొలఁగుమృగములనంగఁజూపులుచలింప
నూర్పుగాడ్పులరాఁకలకులుకుబిసము । లనభుజములూఁడవెడలిరయ్యలరుబోండ్లు.

సీ. కైలాసశైలంబుఁబోలిభృంగిచ్ఛానటద్భ్రమరాధిపాడంబరంబు
నందనంబునుబోలిమందారకల్పచందనపారిజాతసంతానసాంద్ర
మాహితాగ్నిగృహంబుననుకరించిమహాఫలప్రసవవిభూతిలాలితంబు
స్థానీయమువలెమాధవపూజనాద్విజశ్రుతిరసాయనవాక్యశోభితంబు

పుండరీకాక్షుపాదంబుఁ బోలి విశ్రు । తామృతరసప్రవాహమై యమరి మాని
నీవితానము దరిఁ జేరఁ బోవు దారి । మానసానందమొసఁగె నుద్యానవనము.

సీ. కాదంబములనొక్క కాదంబగామిని కాంచనంబులనొక కాంచనాంగి
పున్నాగములనొక్క పున్నాగనాభిక శ్యామాసుమంబుల శ్యామయొకతె
పాటలంబులనొక్క పాటలగంధిక కేసరంబులనొక కేసరరద
కర్ణికారములొక్క కర్ణికాకృతికర్ణ బంధుజీవములొక బంధుజీవ
తిలకలతికాంతములనొక తిలకనాస । వజ్రపుష్పప్రచయమొక్క వజ్రనఖర
త్రుంచెఁ దునిచెను రాలిచెఁ ద్రోచె వ్రాల్చెఁ । గిల్లెఁ గోసెను గీటె వజల్లె నెఱపె.

చ. వనిఁ జెలిఁ బిల్వ గోగువిరి వ్రాల్చిననోర్తుకవక్త్రి మెత్తఁ బో
న్ననలు నించె నోర్తదిగ నందిలకంబి గురించె నోర్తు విం
తను నగఁ బూచెఁ గాంచనము దానికి రంజలి యోర్తు బాడఁ బ్రేం
కనమి గురించెఁ గేసరము కామిని యోర్తుక యూఁచఁ బూచెఁ దాన్.

మ. అబలా చూచితె మల్లినా నొకతె యొయ్యం జూచి నీలోత్పలం
బుబలా మాటెద వేమినా నొకతె చేఁ బొందించి కెందమ్మి గ్రా
ప్రబలె న్నామఱి యోర్తు మైప్రభలు బర్వం గాంచనం బన్నఁ ద
న్నిబిడభ్రాంతి కొకర్తు నవ్వ నిరవాందెన్నెల్లియై యవ్వనిన్.

సీ. అతివ నీవొక్క మాటాడవే యని పల్కఁ బదమెత్తి గంతులు వైచె నొకతె
యొకెక్క తెలత యెక్కి యూచుమో యన్నంతఁ గొమ్మమీఁద నొకతె యుమ్మివైచె
వనిత నా కామోదవాంఛ గల్గెననంగ వెన్నునఁ జఱచెను వెలఁది యొకతె
గెంటుమీ యూద్విజంబంటె నా నొక్కర్తు పొలఁతి పల్లాడింపఁ బోయె నొకతి
యొకనెలఁత యంబరంబు ముట్టకుమనంగఁ । బోడుగ ఱివి గానగగనంబు ముట్టనీకు
నేర్పుగలదే మొ నేనంత నేరననియె । నొక్కరిత మేలములఁ బూని యువిదలందు.

సీ. కరిరాజయాన యొక్కరిత డగ్గఱఁగఁ గేసరిమధ్య యొకతె పూసరి నివిసరెఁ
దుహినాంశుముఖి నోర్తు మహినిఁ ద్రోయఁగ నొక యహిరోమరాజి దాని హత్తిఁ జేసె
శుకవాణులిద్దఱంశుకకర్షణము సేయ నొకసాంకవామోద వికృతిఁ దీర్చెఁ
జంచరీకాలక సంచలింపఁగ నొక కాంచననానపూల్వాంచివైచె
మదనసామ్రాజ్యలక్ష్మి నాకొదవె ననుచు । ముదితయన నొక్కతగ్గి నీ ముదము బోవ
నదుముదు నటంచు నుగ్రతఁ గుదురుకొల్పెఁ । గుసుమనిచయాపచయకేలిఁ గొఱలు నంత.

సీ. కౌశికరంభలు గలిసియుండెను జూడు కౌశికరంభలు గలియుటరుదె

పల్లవాప్తినిఁ గొమ్మలల్లియుండెను జూడు పల్లవాప్తిని గొమ్మలల్లుటరుదె
పున్నాగమహిళాప్తి పొసఁగియుండెను జూడు పున్నాగమహిళాప్తి పొసఁగుటరుదె
గణికాప్రియకయోగమెనసియుండెను జూడఁ గణికాప్రియకయోగమెనయుటరుదె
యదిరమాధవలక్ష్మీశు భైక్యము గను | మతివమాధవలక్ష్మీశు భైక్యమరుదె
యనుచు నరోక్తిచాతురులెనయ నాడి | వనజలోచనలరిగి రవ్వనమునందు.

గీ. పుష్పవతియైనకొమ్మనిప్పాలఁ తియుంటె | మీరలంటకుఁడని యోర్తు మేలమాడ
నతివ నీవరజోవతివై తివసన | మరసి కొమ్మని పుష్పాడిఁబఱపె నొకతు.

చ. మగువలు మూఁగి సాఁగ నొకమానిని మాటికి నేఁగి లోఁగి బా
గుగ గలరసాలదివ్యతరుకోటరమందున డాగ దానివ
జ్జగ నరుదెంచి యోర్తు కలసత్తరుకోటరమౌరపూచె నం
చుఁగలికి గోళ్ళ గిల్లనదిజూత్తిలఁదన్నిననవ్వి రెల్లరున్.

సీ. ఏలాలతాతన్వి యేలాలతలు జూతువతివ నీబాహుసామ్యంబుఁదలఁచి
దాడిమీఫలములోఁ చేడె! కాఁతువ దేలవెలఁది! నీవక్షోజకలనఁదలఁచి
చానరో! యేలప్రసూనరాశిఁ గనుదు గరిత! నీనఖరవైఖరిఁదలంచి
జలదవేణి! కిసాలముల నేల జూచెదు పడఁతి! నీపాదసంపదఁదలంచి
ప్రమద! యేలవిలోకింతు భ్రమరకముల | రమణి! నీదుకటాక్ష విభ్రమముఁదలఁచి
యింతి! కుందములఁ గనెదవేల చెలువ! | నీరదంబులఁదలఁచి యని చనిరవల.

సీ. తమచన్గవకుఁగవయమరు నియ్యవియన్న కోరికఁ దియ్యని పండ్లఁ గొన్ని మెక్కి
తమచేతులకుఁదులయమరు నియ్యవియన్న కొమరొప్పఁ గాఁ బల్లవములఁ జేర్చి
తమనఖంబులకు నఖములియ్యవియటన్న తెరువున విరువేర్చి తురుమునఁ నిడి
తమభుజములకు సమములియ్యవియయన్న చెల్వానవల్లరుల్చే తనిమిరి
తమవచోమాధురికి సరిదగునివియను | పోలికను బూవుఁదేనియలూని క్రాఁద్రావి
తమకటులకి విభటులనఁదనరినట్లు | పుష్పాడులతిప్పలెక్కిరప్పువ్వుబోండ్లు.

సీ. మిత్రమౌ మరుజైత్రయాత్రకై చైత్రుఁడు త్రస్తరసేర్చు నస్త్రంబులనఁగ
వనదేవతలతోడఁ దనరి పొందొనరింపఁబఱతెంచు దేవతావనితలనఁగ
మదనమోహనమూర్తి మది మోహపడ రతివహియించు బహుళవిగ్రహములనఁగ
నామని భర్తరాఁ బ్రేమమై నెదురుగ వనలక్ష్మిఁ బంపెడు బలగమనఁగ
మదనమాయాప్రపంచమీమహిమమీఱె | మహికి దాడి వెడలి మిత్రమందిరమున
విడిదిఁ జేసెనొ యనఁగనా వెలఁదులెల్లఁ | బ్రేమవాటిల్ల మెలఁగి రారామవాటి.

ఉ. మందరమందమారుతము మోదముతో నెదురౌటయొప్పెనో
సుందరులార ! మీరలసిసోలితిరిందులకేఁగుదెంచిమా
యందలిప్రేమనంబువులనాని శ్రమంబెడలించి కొండటం
చందఱిఁబిల్వఁబంపెడు నరోంతరమాభటకృత్యమోయనన్.

సీ. కల్కిపల్కులవగఁగుల్కుతీరుపుఁదీరఁగోరె నారాచిల్కబారుసేర
గానంబులకు మదినానందమొంది నేర్చెనయుటకట్లకోయిలలుడాయ
మెయితావిఁజవిఁజూడమెలపునఁగలిసెనానలసానిలములుమేనలమివెలయ
నడలబెడంగువెంబడిపాలుపడఁదోడఁదొడఁబడెనానంచలడుగుఁదొడర
ముంగురులరంగుఁజేపట్టమునరెననఁగ । గండుతుమ్మెదపదుపుమొగంబుముట్టఁ
గైశ్యసేవలుసేయంగఁగదిసెనామ । యూరములువెన్నునంటనయ్యువిదలలరి.

సీ. కాదంబమడలునీగతి కోడికొమ! కాదుతరుణి! నీకైశ్యకాదంబినిఁగని
నీకుచస్థితి కేఁగుఁగోకంబుసకి! కాదువనిత! నీవక్త్రచంద్రునకునులికి
యళులూఁగునీముంగురులమెచ్చిచెలి! కాదుసకియ! నీనాసకాంచనముఁగాంచి
చిల్కనీపల్కులకులుకఁగల్కరో! కాదుముదిత! నీసాంకవామోదమలమి
గంధగజయాన! నీయూర్పుగాడుపులకు । గంధవాహుఁడు తొట్రిలుఁగాంత! కాదు
నీదుకీల్గంటునీలఫణిభ్రమమున । నంచుఁబ్రశ్నోత్తరములిచ్చుకొంచునరిగి.

గీ. అమలకమలానుషంగమోదమునను, భ్రమ । రాళిహితవృత్తి, హంసవిహారకలన.
హరిహరహిరణ్యగర్భులహరువుదొరయు । సరసిఁదరిసిరిసరగబిత్తరులు తరలి.

సీ. శైవలకైశికల్శతపత్రవక్త్రులుచక్రవాకస్తనుల్సైకతకటు
లావర్తనాభికలండజనేత్రల్మరాళగామినులుమృణాళభుజలు
కంబుకంధరలుసౌగంధికామోదలుమకరజంఘికలుకూర్మప్రపదలు
విద్రుమాధరలలవీచికావళులళిభ్రమరకల్కనరరదనవిసర
లపువిలాసినులే తేరనరసిసరసి । రమణనామోదరసతరంగములుపొంగ
భ్రమరగానముతోద్విజప్రతతినొఱసి । సరసనెదురయ్యెనిదిబంధుసరణిగాదె.

చ. అదెకనుసారసాళులాలయంబరచక్రములాక్రమింపనీ
ర్ష్యదవిలిచెందెడుంభువనజాతములన్వడిరాజహంసముల్
మదవతి! సారసాళులలమంబరచక్రములాక్రమింపనీ
ర్ష్యదవిలిచెందరే! భువనజాతములన్వడిరాజహంసముల్.

చ. పొలఁతుకచూచినావె! దరిభూజనులెంతయునాశ్రయించిన

త్పలదళసూనసంతతిను దారతఁ గ్రమ్ముచునుండె, నీమది
నొప్పలయుదు వింతమాత్రసరసుల్గ దజీవనదాతలెందునె
చ్చెలి! కమలాకరస్థలులసిద్ధము లౌఁగ విలోకయోగముల్.

మ. భళి! పద్మాంచిత చక్రయుక్తిఁ బొలిచె న్వైకుంఠముం బోలి కా
దలకాస్థానము భామ! శంఖముకరోద్యత్కచ్ఛపప్రాప్తి, నె
చ్చెలి శృంగారరసాచ్యుతస్థితినిఁ బొల్చెన్ ద్వారకారీతిఁ గో
మలి యభ్రంబవు రాజహంసఘనసమ్యగ్వృత్తి చేఁ జూచితే.

చ. అనితమలోన నాడికొని, యాసరసీప్రవిలాసముం గనుం
గొని, యనుమోదముం గొని, తగుల్కొని, చెల్వలు చల్వ లెల్లఁ జే
కొని, రణవంబులూడ్చికొని, కోరిక నొండొరు చెట్టఁబట్టి నె
క్కొని, దరినిల్చఁ బొల్చెఁ దముకుం బ్రతికక్షవహించి చాయలున్. [ద్రుంచె

గీ. సమదగజయానయోర్తు తోయముఁ గలంచె । హేమమయూఖాస్య యొకతె పద్మములఁ
జలదవేణి యొకర్తు హంసలనడంచెఁ । జంపకానోద యొకతళిచయము నొంచె.

చ. ముదిత యొకర్తు తోయమున మున్గి నఁ బైపయిఁ దేలు కేశము
ల్మదవతి యోర్తు నాచనుభ్రమం దనయీదుటకడ్డటంచుఁ జేఁ
గొదగొని లాఁగ లోవెదకి కోమలి పాదముమ్రదంబులం
బొదువఁగ నక్రభీతిదిగఁ బోవదు తానెవ రెన్ని జెప్పినన్.

చ. వనితలు కంఠదఘ్నమగు వారిమునుంగ నెలంతరంబులం
దనరెడు మోములన్ విమలతామరసావళి యంచు మానసం
బున భ్రమఁ జెంది భృంగతతి మోదమునన్ మధుపాను నాసవ్రా
లి సెమకి నాసచంపకములీలఁ గనుంగొని పాఱు భీరుతన్.

చ. కలకలనవ్వుచున్ విపులగంధగజాధిపయాన యొక్కత
వ్వాలవల నొప్పకర్జము నెపంబిడి దాపున కేఁగి మేలమా
పొలఁతుకపైఁ జలంబున నుజాలజలంబులు దోయిలించి మో
మలమఁగఁ జల్లఁ బోనదుమనంగన యోర్తు దిచిమ్మెఁ గ్రమ్మఱన్.

సీ. పదములఁ దేలించి మదవతు లీదుచోఁ సరసెల్ల నెఱ్ఱదామరలు గాఁగఁ
జేతులఁ బైకెత్తి చేడియ లీదుచో మడువంతటమృణాళమయము గాఁగ
ముఖదృష్టి గాన్పింపముద్దియ లీదుచోఁ జెరువెల్లఁ గల్వల చెల్వు గాఁగఁ
గచములు గన్పట్టఁ గామిను లీదుచోఁ గొలనెల్లఁ గలితశైవలము గాఁగ

చెలికిలంబడియాడుచో వెలఁదులెల్లఁ। గొలఁకుకుంభస్థవంబులకొలువు గాఁగ
జూపఱకునచ్చెరువుమదిదోపవార్ధి । హరమొనరించిరింతులవ్వారిగాఁగ.

సీ. ఓలనీకిచుదుసుమీలతాతన్వినా కేలయావాల్గంటిచాలునీకు
నోలఁజూపుదురమ్మ బాలయీవేళనా కేలూనులోనింతజాలుకొ నిదె
జాలమాపిల్చులోఁగ్రాలఁగావలెఁగాని వాలునీకన్నయానీలవేణి
చాలునన్నెవ్వారుదూలింతురే గోలకూలంకషప్రజ్ఞలేలబేల
యోలయోలయిదేయోలయోలయోల । యోలయోలయటంచునవ్వేళహేళిఁ
గేలుసారించికుంభినీలీలఁదూలి । యోలలాడిరిజలకేలిఁగ్రాలుగట్లు.

చ. సరసిచెలంగెనొక్కయెడఁజర్చితచందనకర్దమాప్తని
ర్జరనదిమాడ్కినొక్కయెడసంశ్రితకజ్జలరేఖలన్దివా
కరతనుజాతకైవడినొకస్థలిహారిహరిద్రభావిభా
స్వరతసరస్వతీప్రతిభసారసనేత్రలుక్రీడసల్పఁగన్.

మ. వనితాక్రీడసితాసితారుణసరోజాతోత్పలవ్రాతకృం
తనతాపంబునరోవరంబునలుసంతంజెందదత్యాశఁద
త్తనుభరాన్మథరపద్మరాగ, రదముక్తా, హంసహీరాప్తికై
ధనమూలంబుజగంబులన్నపలుకు ల్తథ్యంబులూహింపఁగన్.

గీ. అమృతనిధియొట్టఁబొడతేటునమృతకళలొ । శరధిగావునవెడలెడుమరుశరములొ
వారివాహమపుటవెలువడుమెఱుములొ । యనఁగసరసీతటముఁజేరిరబలలెల్ల.

గీ. ఇటులజలకేలిఁజాలించియెలమివెలయఁ । గొలనికూలములోని, దుకూలములను
మేల్మిమీఱిడితొడవులమేనఁదొడిగి । యపగతశ్రమలై చను నాసఁదవుల.

క. అళియళికోకముకోకం । బలయాశుగమాశుగంబుహరిహరికుముదం
బులుకుముదంబులుశిఖిశిఖి । యలివేణికినయ్యెమనసిజాస్త్రాహతిచేఁన్.

సీ శుకపికశారికానికరారవముకర్ణపదవికిశరపరంపరలుగాఁగ
సరసవిలాసకిసాలయజాలంబు స్మరనిశితాసిపంజరముగాఁగ
దక్షిణాశాభృదుద్యన్మృదుపృషదశ్వశాబముల్విషగుళుచ్ఛములుగాఁగ
నుత్ఫుల్లమల్లీముఖోల్లసద్వల్లీసుమాళులు హృదయశల్యములుగాఁగ
రహిసమస్తప్రసూనవిస్రస్తమధుర । సప్రమత్తపుష్పంధయజాతనినద
ఘూర్ణవిహరణలుతుపాకిగుండ్లుగాఁగ । మన్మథోద్రేకమెడలేకమదిగుదింప.

సీ. కేకలరాకొట్టుకేకిరాకాశివాకట్టుక ప్రపుబూడిఁబెటరమ్మ

సుడివెట్టుసోఁకుడుదొడరకుండఁగడంగి చక్రిసంస్మరణంబు సలుపరమ్మ
కోయనిబెదరించు కోయిలకొరవిదయ్యమునుశుచిస్త్వేల్చియడఁపరమ్మ
ద్రుమానెక్కి ఝుంఝుమనుమధుపభూతమునకుఁ గాంచనపత్రికఁగట్టరమ్మ
చాలఁగలఁచెడిచిలుకపిశాచివదల । సాంకవాధిక ధూపమొసంగరమ్మ
భూతపరివృతవనికిఁ దేఁజూతురమ్మ । కోరిముల్లూడ్చియటఁగొట్టుఁగొట్టినట్లు.

క. అనిలక్ష్మణాంబుజానన । మనమునసంతాపభరము మలసిపలవరిం
చినఁగనుఁగొనియుపశాంతిం । గొనకొనియొనరించి, తోడుకొనిపోవుమదిన్

మ. జలయంత్రంబులఁగాంచుచుంగుసుమవిస్రస్తాసవాసారకు
ల్యలనొక్కుమ్మడిదాటుచున్నమపరాగాబద్ధకూటంబుల
న్వలనొప్పారఁగనెక్కుచున్ శుకపికధ్వానంబులాలించుచుం
గలకంఠీమణులెల్లజేర్చిరినిజాగారంబు, రాకన్నియన్.

క ప్రచురప్రహర్షస్త్రక్షతి । విచలితమందేహదేహ విసృవదస్రో
పచయప్రవాహమనది । ర్నిచయంబున జరఠరవిస్ఫులింగగణమొసఁగెన్.

చ. తిమిరవిరోధివేఁగడలఁ దిమ్మరఁగ్రమ్మరవానిమీఁద శీ
ఘ్రముద్ధృతరౌద్రభావముఁ బ్రకాశముఁజేసెనొ లేకవారుణీ
ప్రమదప్రియంబుమైనెదురువచ్చినఁజెచ్చెరహృద్గతానురా
గమువెలిఁజూపెనొ క్రొయ్యనఁగాఁదగెనంబరతారుణప్రభల్,

ఉ. ఇనుఁడనురక్తితోఁగరములెత్తికవుంగిటఁజేర్చిమమ్మునా
య్యాననమోదముంబొనవియద్దిరయిత్తఱిసేమికోపగ
ల్గానియపరాశఁజెందెనిదికూడునె? కూడఁగఁదెమ్మటంచుఁ బ
ద్మినివెనుబంపుబంటులనదీర్ఘములైవడినీడలేఁగెడిన్.

క. వరుణహరిత్తరుణీమణి । కరముచిఱుతనాటియాట్లకైయొగ్గవైవం
గిడిందు కెంపుతాళిం । బురుణించుచుఁదరణిగ్రుంకెఁబొరిపొరిశరధిన్.

సీ. తానసంతమణిన్నైతనరుటరత్నాకరుని కెలింగించుటకెనసెననఁగ
బడబపైభ్రాంతిచేఁబాఱురథ్యంబునుమరలింపలేకతోఁదరిగెననఁగ
రాజునకుంగరార్పణఁజేసియునుఁడోటఁజెందుసేవ్వాగమూలడించెననఁగ
వసుహీనుఁడైరాఁగఁబశ్చిమదిక్స్త్రీతోయఁబొల్పరియబ్ధిలోఁబ్రుంగెననఁగ
మిత్రవిఖ్యాతితోఁధాత్రిమెఱసెఁగాన । దుష్టునకుదూరమన్నట్టిత్రోవఁదెలిసి
చయ్యనఁదమస్థితికిదూరమయ్యెననఁగ । నంతమార్తాండమండలమస్తమించె.

సీ. అంజనకుంజరమంజులగండసమంజసగైరికపుంజమనఁగ
నపరసాగరతీరవిపులారుహాతిప్రవాళలతాప్రరోహాళియనఁగఁ
బ్రత్యఙ్మహీధరప్రస్థతటస్థప్రశస్తరత్నద్యుతిసారమనఁగ
రవిరయధావితరథహరిఖురపుటోద్ధూతదరీశోణధూళియనఁగ
వరుణహరిదీశ్వరమణిగోపురవిరాజ । దరుణపల్లవతోరణస్ఫురణమనఁగఁ
గాలచిత్రికరాలయగతకుసుంభ । వసనమన సాంధ్యరాగంబు వన్నెమీఱె.

గీ. విరహిణీపాంథసందోహవిజయయాత్రఁ । గోరి వెడలినలయశంబరారిసౌరు
మీఱువిడిసిననీలికూడారమనఁగఁ । దమముబహుతమముగదిగంతములఁ గ్రమ్మె.

గీ. సాక్షుఁ జల్లిప్రదోషదస్యుఁడు నిజాంబ । రమణిహరణంబొనర్పఁ దత్క్రియ మఱుఁ దెలియఁ
దలఁచిదినలక్ష్మి వైచినతస్కరాంజ । నమ్మనాఁ జిమ్మచీకటి గ్రమ్మికొనియె.

గీ. రాజు బయలఁగొల్వుంటకు రాజదభ్రి । కాయమానమునఁ దమోనికాయమనెడి
నీలిచాఁదినియమరించి వ్రేలనిడిన । పూవుచెండ్లన నుడురాజిపొలుపు మీఱె.

చ. గగనవనీప్రదేశమునఁ గాలమృగేంద్రుఁడుదీర్ణపంచశా
ఖగతమహానఖంబులనఖండపరాక్రమలీలఁ జెండివై
వఁగఁదిమిరద్విపాధిపవిభాస్వరకుంభసముద్భవంబులై
తగఁగనుపట్టుముత్తెములతండములో యననొప్పెఁ దారకల్.

చ. తనప్రియుఁడైనచందురుఁడు దాఁజనుదెంచునటంచు నెంచియా
మినియనుభామినీమణి తమిస్రముఁ గాటుకఁదీర్చి చెందొవం
జనురుచిఁ గుంకుమంబునిచి జానగు తారలఁ బూలఁ దాల్చి సం
తనఁగదుకూలమంగమునఁ దార్చె ననందగెఁ బాండిమంబొగిన్.

గీ. అంతరిక్షమహేంద్రసభాగ్రసీమ । యామినీనటిచటులనాట్యంబుఁ జూప
సమయమనుమేళనాయకుఁడమరనెత్తు । తెలితెరయనంగ ధవళిమ వెలసెదివిని.

చ. కలువలఱేఁడుపూవులిలుకానికిఁ దోడుతమంబు సూడు చే
నెలఁతుక వేఁడ్క కాఁడు నలినీసుమబాంధవు జోడు దేవతా
వళిఁ దనుకూడు మేల్కళలపాళికివీడు తలోదరీముఖం
బులకిలనీడు నత్పటలిఁ బొందెడువాఁ డుదయించెఁ దూర్పునన్.

సీ. అమరావతిని శచీకమలలోచన చేతఁ దాల్చిన తెలిమహతాబనంగ
వేలుపుగమియేటి పెందెఱలందుఁ బెంపొందిన వెలిదమ్మిపూవనంగఁ
బ్రాచీదిగంగనాప్రాంచత్కచమునఁ జేర్చిన తెల్లచేమంతిచెండనంగ

# ద్వితీయాశ్వాసము.

బృందారకేంద్రరాజ్యేందిరారమణికిఁ బైఁగూర్చినముత్యాలగొడుగనంగఁ
బంచబాణుఁడుజగము గెల్వంగఁదలఁచి । కైరవాదికమార్గణగణనికష
ణంబుఁ బూనరించుహీరశాణంబనంగఁ । జంద్రబింబంబుబొడసూపెసాంద్రరుచిని

మ. విమలాంభోదపదవ్యవస్థిత సుధావీచీప్రచారస్ఫుట
ద్యుమహాద్వీపవతీప్రతిస్ఫురణనుద్యోగించుచుం గౌముదీ
సముదాయద్యుతిరోదసీకుహరమాచ్ఛాదింపఁ జూపట్టెది
క్ప్రమదావృత్తకుచద్వయీపరివృతక్షౌమాంశుకంబోయనన్.

వ. అంతట.

సీ. అసమమార్గణగణమదరంటిబరువెక్కు భూషణంబులు మేనఁ బొరువఁబోదు
చంద్రబింబముముందుచక్కనున్నటులుండ నిల్వుటద్దంబులోఁ జెల్వుఁగనదు
రోలంబగుణమునిరోధించి వెంబడ వేణివై చికొనంగ వేడ్కపడదు
కోయిలరాయిడి కొలకొల చెవిసోఁక మారుమాటాడఁగ మనసలఁబోదు
చందనానిలములు మేనసందడింప । నవ్యచందనచర్చయొనర్పఁబోదు
చెప్ప నేటికి యాకృతిదప్పఁగలికి । చెఱుకువిలుకాని బారికిఁ జిక్కిసొక్కి.

సీ. ముక్కెరముత్తెంబు మొనసినీలంబయ్యెనిట్టూర్పు గాడ్పులనీరుడించి
ఎడఁదఁబూసినగందవొడి కందికస్తూరికాపంకమయ్యెలోఁగాకఁదాఁకి
కనకతాటంకములినుపకమ్మలఁబోలె నెఱ్ఱఁబాఱినచూడ్కిఁచుఱ్ఱుదవిలి
యొఱ్ఱగల్వలు సెజ్జనిందీవరములయ్యె విరహజ్వరము మేనవిరియఁబాఱి
తలఁదవ్రులమేనఁదాల్చినచలువనీలి । వలువయయ్యెను వేడిమిపయికిఁబొంగి
యతివయంబురుహంబకాయత్తచిత్త । యాటనంబురుహంబకాయత్తగాదె.

సీ. తనువునఁబన్నీటిచినుకులు చినుకఁగసురసురమనియింకిసొక్కిపోయె
గబ్బిగుబ్బలనుముక్తాహారములు ప్రేయఁజిటచిటచిదురులై చిట్లఁబాఱె
నొత్తుగమెయినిండమెత్తినగందంబు వడికుతకుతయనియుడుకువట్టెఁ
గర్పూరకస్తూరికామిశ్రపంకంబు పై బెత్తియంతటబీటవాసెఁ
జల్వవెదచల్లు చెంగల్వసరులుగప్ప । వత్తులై యెప్పపాటులో వాడుదేఱెఁ
జల్వఁబైఁజేయలో వేడిచను నెరోగ । మొకటివైద్యంబొకటియంటప్రకటమయ్యె.

సీ. మంచిగందపుముద్దలంచుసున్నముదెచ్చి మెత్తుదురే మేనమెలఁతలార!
పన్నీరనుచుమాయఁబన్నికాగినసూనెఁద్రిమ్మరింతురెముద్దుగుమ్మలార!
యలరులపాన్పనియగ్గిగుండంబునఁబడఁద్రోతురే? నన్ను బడఁతులార!

కర్పూరదామముల్ప్రేఁతుమనిసర్పసంతతిఁగూర్తురేసకియలార!
కండచక్కెరయనినాభియుండఁదెచ్చి । పెట్టవత్తురెనానోటవెలఁదులార!
వలదుమునుకిన్కయనివారివదరిమదన । వేదనామాయమానయైవేఁగివెలఁది.

క. కలువలచెలిమేలిమిమె । న్నెలలనలజ్వాలలపుటనెలఁతయలఁతఁగ
న్నులువిచ్చితెలిసిచెలువలఁ । గలిసియుపాలంభనంబుఁగావించెనిటుల్.

చ. కువలయబాంధవుండవనికోవిదులందఱువల్కుచుందురెం
దవిరతమిత్రసంగతవిహారములేదనుమాటటుంచుమో
ధవళమయూఖసంతతముతమ్ములదాయవైతినీవుభా
వవిహృతినెంచరాత్రిచరవర్తనమెల్లనుదెల్లమయ్యెఁగా.

క. వెలయింపఁబోయివెలచిన । తెలఁగుననీపుందమోహ్యతియునర్తనటం
చలిమితమోహహృతుఁడవై । పలినోపుటదెలిసెఁజుమభువనజాతారీ.

క. మిత్రుఁడుశుచియనిఖరతా । పాత్రులరవిపావకులనుపాసించివియో
గత్రాసమొసఁగుదువుదు । రైత్రివికృతఫలముఁజూపమానునెచంద్రా!

గీ. మొదలఁజలివెలుఁగనమొనసిసత్సంగతిఁ । జెలఁగిపిదపవేఁగివెలుఁగవైతి
చంద్ర? చాలుఁజాలుఁజదువంగవైచిన । నున్నమతియుఁబోయెనన్నయట్ల.

శా. ధాత్రిన్ ధాతమహోగ్రశేఖరుఁడవైదర్పింతువంచుంగదా
గాత్రాక్రామితపాండుయక్ష్మమయరోగక్షుద్రబాధావిధా
పాత్రుంజేయుటయంతమానవుగదా పాంథప్రభేదంబునీ
యాత్రంబేల? యడంగుఁగృష్ణసమయప్రాప్తిన్ క్షపాధీశ్వరా.

సీ. సోమాభిధానంబుసొంపొందుటకుమహార్యాభిముఖ్యవిహారమందినావొ
రాజాభిధానంబురాజిల్లుటకునెల్లకుజనులయభివృద్ధిఁగుంచినావొ
విధుసమాహ్వయముశోభిల్లుచుండుటకుసత్సంతతినేలంగఁజాలినావొ
జైవాతృకాభిఖ్యసవరించుటకుఁబ్రతిమాసంబుక్షీణింపమానినావొ
పేరుమాత్రముచేనేతిబీరకాయ । చందమొందితివెందేనిఁజర్చసేయ
నీమహావర్తనంబుపయోముఖవిష । కుంభతుల్యంబుసుమ్మిసెకొక్కనిమృగాంక.

సీ. దర్పకుఁడన్నట్టిదర్పమాత్రమెకానియుగ్రునిసుతయునోర్చితేమొ
సౌందర్యమూర్తియన్సంజ్ఞమాత్రమెకానియలయనంగస్థితిఁదలఁచితేమొ
కామప్రవృత్తిచేగర్వింతువేకానిమదనవిభ్రమములనుమఱచితేమొ
— విరివిల్లుగలదనివిర్రవీగెదుగానిమధుపానగుణవృత్తిమానితేమొ

యద్దిరానీదురీతివ్యత్యస్తమయ్యె । జగముగములనుజగజెట్టితగవునఁదగి
మగువలనెపగఁబూనినెవ్వగలఁబెట్ట । సాగితివిచాలుఁదగవోరిశంబరారి.

సీ. పలుగాకిమూకలోవలమెలఁగెడునట్టిగండుగోయిలబలుపిండుదండు
కుజనులనేలుసహజకళంకియగునిశానాథుఁడెంచఁబ్రధానవరుఁడు
పృథులతరపలాశివృత్తియౌజాతివిరోధిచైత్రకుఁడు సేనాధికారి
గరధరకులముతోసరిపొత్తుమనుమందుఁడైనప్రభంజనుఁడలశతాంగ
మకటయిటువంటిదుష్టబలాళిఁగూర్చి । పాంథభేదావిధానంబుఁబ్రబలఁజేయు
కఠినచిత్తుఁడవగునీకుఁగడుదయాప్తి । వృత్తివర్తించునేలోనవిషమబాణ.

చ. త్రిభువనసంతతావనరతిందగుపంకజనాభుఁడౌరమా
విభునకుమాధవాహ్వయమువేడుకనొప్పెడుఁగానిదుస్తరా
రభటినిబాంధనారులనిరంతరమార్తియొనర్చునీకిడ
న్నభలనుసారమేయమునుసామజమన్నటుసూవసంతమా.

క. మిగులద్విజహారిగురుత । ల్పగమధుపస్వర్ణచోరులనుబొందికసే
యఁగఁబంచమహాపాతకి । వగునీపొంగెల్లకాలమలరునె? చైత్రా.

క. ప్రబలగతింగుజనులవలె । నబలావళినలఁతురేమహాబలులెచ్చో
నబలావళిపైఁబగఁజే । యబలానీబిరుదుదగెమహాబలబలమై.

గీ. ఒడలెఱుంగఁబడకయుండుమీకొండేమి । దెలియుమదనమధ్వనిలముఖార
పుట్టుగ్రుడ్లుమీకునెట్టొండుగాన్పించు । శుకవినీలకంఠపికముఖార.

క. అనివనితామణులలల । క్షణతోడంగూడియాడికలతాపంబా
రనికతననలుకదీరక । మనసిజబలములఁదలంచిమఱలన్నలుకన్.

సీ. జూసైనచానమోమైనఁజూడకనేచఁజందమాయిదినీకుఁజందమామ
మగువలతలమిన్నమాటలైననువినకీరసమూనెదేకీరరాజ
సుందరివాలారుచూపైనఁజూడకింతేటికేయేచుటతేఁటిజెట్టి
యంబుజాక్షిస్వరూపమైనఁదలంపకసంచలింపించెదేపంచబాణ
కందుఁజెందినమరుబంధమందిననిజ । వృద్ధిలేకున్నదేహమ్ము పెటిలిచెడిన
మఱలఁదలయెత్తికొంటిరిమానహీన । జనులకిలలజ్జకొంచెంబయిననుగలదె.

వ. అని.

క. ఎంతయునిందించిననొ । క్కింతైననుగఁతుతాపమీఁగమినిభయ
భ్రాంతలయిప్రార్థనావచ । నాంతరములుపలుకసాగిరిరంతటకాంతల్.

చ. అమృతమయత్వముంబరమహంసహృదంతరమోగరీతిన
త్సమవనమత్యనంతపదసంస్థితిఁగన్గొనికాదె ధాతనే
ర్పమరనొనర్చెనవ్విధుసమాభిధగానజనోపతాపసం
భ్రమమెడలింపనీకుసరివత్తురెదైవములుత్పలప్రియా.

ఉ. కూడఁగరానివారిసమహూర్తుపుబాపుదువెంతో మైత్రినో
మోడకనీదుప్రోడతనముంగొనియాడఁగనెవ్వఁడోపునీ
తోడనెదిర్చెనెవ్వఁడిలఁదొల్లియునీవలలోనఁజిక్కకీ
రేడుజగంబులంగలిగెనేమొకఁడైననుబూవిల్తుఁడా.

సీ. సకలలోకత్రాణసంభ్రముఁడైనజనార్దనస్వామిజనకుఁడు గాఁడె
సంపత్సమృద్ధ్యధిష్ఠానదేవతయగుజలజాతగేహినిజనని గాదె
యధికవిభ్రమవదాన్యాగ్రేసరోత్తమఖ్యాతిదుగ్ధాంభోధి తాత గాఁడె
తతచతుర్దశజగద్రచనాప్రవీణతాఖ్యాసిమైనవిధాతభ్రాత గాఁడె
శోభనారంభకరవైభవాభిరామ । భోగిజంభారినీపితృవ్యుండు గాఁడె
యట్టిసత్కులసంజనివైననీవు । సరవిసామాన్యుఁడవెదయాసదన! మదన.

గీ. వినుతనానాగమసమగ్రవిగ్రహుండ । వమలసుమనోరతుఁడవువియచ్చరాః
న్ప్రచారుఁడవగుదువనారతంబ । దెంతయొకచాననేలవసంతనీకు.

చ. ధరణిజగజ్జనంబుపరితాపభరంబెడలించిసౌఖ్యమీ
యరహివహించియంతబహిరంతరపాళులనీవమైవిభా
స్వరగతిఁబ్రాణపంచకమొసంగిమెలంగెదునీదయారసం
బిరువుగనెన్నశక్యమగునేమనుబోంట్లకుమందమారుతా.

గీ. అనిశసన్మార్గవర్తననెనసిదివ్య । ఫలరసాస్వాదివై రామపదముస్మరణ
సేయుచువిరాగివై కానఁజెలఁగుచుండు । శుకసమాహ్వయసాటియెచ్చో

విభూతివృత్తము. అంచుఁజంచలాక్షుల । ప్పంచబాణచంద్రచై
త్రాంచితానిలాదుల । న్విరించిసంస్తుతించులోన్.

గీ. అసమకుసుమధన్వియఖిలావనింగల । విరహిజనమునెల్ల వేగగెల్చి
వేడ్కనొత్తనెత్తువిజయశంఖమనంగఁ । జక్కనైనవేఁగుచుక్కపొడిచె

చ. పటుతరవిక్రమక్రమవిభాసిగభస్తివిభాచమూసము
ద్భటుఁడగుసూరసూరవసుధాధవుఁడల్లదెయేఁగుదెంచుమీ
రిటునిదురింపఁగూడదనియెంతయుఁదెల్పుభటాళినాఁగఁగు

కుక్కుటతతి మొల్లచోటులను గూయఁగ సాఁగెను భగ్నవాగ్ధ్వనిన్.

శా. ప్రత్యూషప్రసవాస్త్రిఁ దద్భుతతమప్రహ్వాండకాసారమం
దత్యామోదవిటీవిటప్రవరమత్స్యప్రాప్తికై పన్నిలోఁ
బ్రత్యాసన్నములౌ టెఱింగి దరిఁ జేర్పంబూను నమ్మార్కృత్తిక
ప్రత్యుప్తాంతరజాలసూత్రమనఁ దారారాజి డిందెం దివిన్.

క. తనతోఁ బుట్టువు విడినఁ । ట్టున కేములు గొట్టు దుశ్శరుండని శశి నా
డిననిందన సంబవ్వలఁ । జనెనో యనఁ బలుక బారి చంద్రిక దొలఁగెన్.

క. మము ద్విజరాజయ్యును శశి । తమి మోహతమమున ముంచెఁ దమ వారని ప్రే
మమున ఖగాఖ్యుఁడు మిత్రుం । డమర నన్ముని చెనను గతి విహగములు మొఱ సెన్.

మ. మగనాండ్రం గవగూడి యింతకు రమింపం బోల్చె మీపాలికిం
బగలే తెంచెడు నాథులార! యబలా బాహాలతల్ వీడి శీ
ఘ్రగతిన్ లెండు సుఖంబు దుఃఖమున కే గాయంచు గూఢంబుఁ దె
ల్పఁ గవాక్షంబున జొచ్చె నావిసరెడిం బ్రత్యూషవాతూలముల్.

చ. తమి నిమనోరథంబౌ నరఁ దార్చి ప్రియుండగు రాజు మాటుఁ జెం
దమది విరోగయోగగతిఁ దాళఁగలేక మొగంబు నందసూ
దమున నిశాకృశోదరి నితాంతము విన్నదనంబుఁ దాల్చె న
న్క్రమమునఁ బ్రాగ్దిశాతటముఁ గానఁగ వెల్వెలబాఱెఁ బెల్లుగన్.

మ. గురుభార్యామణితోడఁ గూడుకొని సిగ్గుం జెందకే క్రీడలం [illegible]
జరుపం జొచ్చిన క్రూరకర్ముఁడని యీర్ష్యం జేసి యత్యంత ని
ష్ఠురముల్ పల్కిన నోర్వరాక యెటులంచుం జక్రవక్త్రింబు గ్రం[illegible]
చరఁ దాఁ జూడఁగలేక డిందె ననస స్తంబందె నిందుం డొగిన్.

చ. హరిహయదిగ్వధూరమణి యాస్యమునందలి కుంకుమంపు భా
స్వరతరచిత్రకంబొ, మెడవైచిన కెంపుల తాళియో, కర
స్ఫురదరుణారవిందమొ, ప్రభూతరుచిం గనుపట్టె నాఁ బ్రభా
కరుఁ డరుణప్రభాపటలిఁ గన్నులపండువొనర్చె నయ్యెడన్.

ఉ. సారజగత్త్రియంబున కజస్రమతిశ్రమ సేయు విశ్రుతా
కారత మిత్రకాన్సపుని గాత్రముఁ గ్రుమ్మఁగఁ గల్యకాలమన్
శ్రీరమణీమణీప్రియుఁడు వేయఁగ వచ్చు లసత్సహస్రధా
రారుగవక్రచక్రమనఁ గ్రాలెడుఁ జక్రహితుండు ప్రాగ్దిశన్.

క. అవలంగువలయలోచన। లవిరళతనుతాపభరమహార్తిశమదలోఁ
గవిసిదివసమొకవత్సర। మువలెవగచుమగువనుగనిమూగివివశలై.

గీ. ఈసమాచారమునురాజవాసవునకుఁ। బూసఁగ్రుచ్చినరీతిఁగవాసిభాసఁ
జేసిమనమెంతయునుదెల్పకోసరింప। మోసమౌనంచుమదిఁదలపోసియంత.

క. కూరిమికుమారిశౌరిం। గోరికొనుటమొదలుతుదకుఁగువలయరక్షా
కారికిమనవినొనర్చిరి। సారతరోదారవాగ్విశారదలెలమిన్.

క. అదివినిజనపతిముదమెదఁ। బొదవందలపోసియెట్లుపొసఁగునొయికనై
వదయ, తనయభాగ్యంబని। యదెపురమలరింపఁబ్రజలకానతియిచ్చెన్.

ఉ. వెల్లలువేసిరెల్లెడలఁబెట్టిరిమౌక్తికరంగవల్లికల్
పెల్లుగఁబూవుపందిళులువ్రేసిరిపల్లవతోరణంబు, లం
దుల్లసిలంగఁగట్టిరిమహోజ్వలకేతువితానముల్లతా
పల్లవపుష్పచిత్రములువ్రాసిరిగోడలఁబౌరులెల్లరున్.

ఉ. ఆయతనేత్రలెల్లఁబురహర్మ్యములందగరూపధూపము
ల్వ్రేయఁగవానిధూమములుగ్రిక్కిరియంబయలంటిక్రమ్మివా
తాయనవీథిరానుపవనాంతవిహారవినీలకంఠముల్
తోయదమండలంబనితళుక్కనఁబింఛమువిచ్చియాడెడున్.

క. లలిముత్తెపుముగ్గులుపెం। పలరినరాకన్నెపెండ్లియగునని వేడ్కం
గలిగినప్రోల్లచ్చిమెయిం। బులకాంకూరములపోల్కఁబొల్పారెనిలన్.

సీ. ఎచ్చోటఁజూచిననెడలేకమంగళతూర్యవాద్యంబులెతోఁచుచుండె
నెచ్చోటఁజూచ్చినహెచ్చైనపచ్చలతోరణంబులుగొనబారుచుండె
నెచ్చోఁగనుంగొన్ననెంతయురంగారురంగవల్లికలహొరంగుప్రబలె
నెచ్చటఁగాంచినముచ్చటగాఁజిత్రవర్ణపతాకసంపదలుగ్రాలె
నెచటఁగనుఁగొన్నసుమదామహృద్యకాయ। మానసముదాయమలరారెమద్రరాజ
ధానినేచోటఁజూచినఁగానిమృగమ। దాదికపదార్థపరిమళంబావరించె.

సీ. అమరావతీపురంబనవచ్చుఁగాకున్నసురభికల్పసుమనస్స్ఫురితమగునె
యలకాపురోత్తమంబనవచ్చుఁగాకున్న వరనీలజాలకభ్రాజియగునె
యలభోగవతియనియనవచ్చుఁగాకున్నఘనభోగిరత్నప్రకాశమగునె
యంచితవైకుంఠమనవచ్చుఁగాకున్న ద్విజరాజకేతనదీప్రమగునె
ద్వారకాపట్టణంబనవచ్చుఁగాదొ। యసమసాయకబలభద్రహారియగునె

యంచుఁ జూపఁ బలంకృతుఁ గాంచి పొగడ । రత్నగోపురపురమల రారుచుండె.

క. వ్యాసాంతేవాసినివన । వాసివరుఁడు శౌనకుఁడు కృపామతి నటపై
భాసిలు చరితము వినఁగమ । హాసంభ్రమమయ్యెఁ జెప్పుమనియడుగుటయున్.

క. అంభోనిధినిభశుంభ । ద్గాంభీర్యోజ్జృంభణాభ్యదంభాత్మశ్రీ
సంభవశుభగంభావుక । సంభృతజంభప్రభేదిసంభ్రమవిభవా.

శా. దాక్షిణ్యార్ణవచంద్రచంద్రదరరుద్రస్వర్ధునీశాద్రికీ
ర్త్యక్షుద్రాంశునిదానదానసలిలానంతస్రవంతీపరీవా
హాక్షేపాయితకల్పకల్పసమయోద్యద్వహ్నితుల్యప్రతా
పక్షీణీకృతసూర్యసూర్యభినుతా వార్యప్రభావోద్యమా.

అంగజాస్త్రవృత్తము. రంగనాథగుణరమ్యగుప్తసా
రంగనాథకవిరాజసాలసా
రంగధారినుతరామకృత్తసా
రంగదైత్యకపిరాజలాలసా.

గద్య. ఇది శ్రీమన్ముకుంద పదారవింద మరందాస్వాదనాసాదిత దీపితకవితా వైభవ శృంగారకవి పల్లయామాత్యతనూభవ వివిధకథావిధానాధీనసు ధీవిధేయ నర్వారాయాభిధేయ ప్రణీతంబైన లక్షణాపరిణయం బను బంధుర ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ

# లక్షణాపరిణయము.

---

## తృతీయాశ్వాసము.

శ్రీసీతాస్వాంతలస । త్కాసారమరాలసేవకవ్రజలోలా
భాసితగుణాలవాలదు । రాసదరావణవిభాల రామనృపాలా.

గీ. అవధరింపుము శౌనకాద్యర్షిశేఖ । రులఁగనుఁగొని సూతుఁడిట్లెలమిఁ దెలుపఁ
గడఁగె మద్రనృపాలాగ్రగణ్యు నాజ్ఞ । సర్వసన్నాహములు సిద్ధసరణిఁ జెంద.

ఉ. పూర్వము బంపినట్టి నృపముఖ్యుని వేగులవారలేఁగి న
ర్వోర్వరయందుఁ ద్రిమ్మరి మృదూక్తుల లాక్షణికస్వయంవరా
ఖర్వమహోత్సవంబది ప్రకాశిలుఁ గావున యంత్రమత్స్యముం
బర్విన పేర్మిఁ ద్రోయఁగలవారలు రావలె నెల్లి నావుడున్.

ఉ. పార్థివమౌళులాశుభవిభాస్వరశబ్దము శ్రోత్రరంధ్రసం
స్పర్థమొనర్ప స్వాంతములసంభ్రమమొందుచు లక్షణావివా
హార్థము సత్వరంబుగఁ బ్రయాణప్రయత్నమొనర్ప వాహినీ
సార్థముతోడఁ దద్విషయసంముఖులై చనఁజొచ్చి రొక్కటన్.

మ. నిరతిన్ హర్షమమర్షముం బెనఁగొనన్ నిత్యోత్సవంబుల్ గ్రహా
రిరసాసంగ్రహమిట్లొనర్చు నన భేరీభాంకృతుల్ వ్యానభోం
తరభాగంబులఁ బర్వి భోరుకొన నత్యంతప్రభావుండు ఘూ
ర్జరభూమిపభుఁడేఁగుదెంచెను సహాసప్రస్ఫుటాస్యంబుతోన్.

శా. ప్రాలేయాచలజన్మభూమియయి యుగ్రప్రస్థితిం జెంది మూ
డౌలోకంబుల మించియండజవరాజ్ఞాదుల్ప్రకాశింప నెం
తేలీలం గలశాబ్ధిఁ జేరు నిజకీర్తిన్ స్వర్ధునీభాసియౌ
చోళాధ్యక్షుఁడు వచ్చె నచ్చటికి మెచ్చుల్గుల్క సైన్యంబుతోన్.

మ. ఒకచో నిమ్ముల నిల్చి మాగధులు సాహోనాదముల్సేయఁగా
యకవర్గంబొకచక్కి గీతతతి నత్యానందముం గూర్పఁ బా
ఠకసంఘాతము లొక్కచో బిరుదగాథప్రస్తుతుల్సల్పఁ గో
రికఁ బాండ్యప్రభుఁడేఁగుదెంచెను ధరిత్రీనిర్జరేంద్రుఁడనన్.

శా. కాశీశుండతిశక్తియుక్తుఁడు సమగ్రప్రస్ఫురైశ్వర్యుఁడి
ద్ధాశాధీశశిరోగ్రభాగరమణీయప్రాంశుకోటీరకో
టీశశ్వన్నవరత్ననూత్నశరఘృష్టిస్పష్టనీరాజిత
ప్రాశస్త్యాంఘ్రినలుండు వచ్చెను విభాస్వద్భద్రకారూఢుఁడై.

మ. అవనిన్ శూరుల గెల్చి, శూరుఁడను పేరన్వర్థమై యున్నయా
రవి గెల్వం దలపోసి తోనరుగు తద్రాట్ఛౌర్యమో నాఁగ సైం
ధవపత్తిభశతాంగఘట్టనజఘుంటామార్గఘూరేణువు

ల్దివిఁగ్రమశంకఁద్రిగర్తభూమిపతిపాళిన్వచ్చె నచ్చోటికిన్.

చ. సరసిజలోచనుండు గుణసంగుఁడు పుణ్యజనప్రదానసా
దరుఁడు సదారమాస్పదుఁడు దారతరారిదరోత్కరుండు భా
స్వరఖగరాజకేతనుఁడు బంధురతేజుఁడు కోసలస్థిరా
వరుఁ డరుదెంచెఁ దన్నృపరపంక్తిజనాథుఁ డనంగ నెల్లరున్.

మ. విబుధుల్గొల్వఁగ శుభ్రదంతిపయి నుద్వేలంబుగా నెక్కి ది
వ్యబలప్రాభవముల్లసిల్ల శ్రితకల్పారూఢిదీపింపవ
జ్రభృత్సాధనుఁడౌట జిష్ణుఁడనఁ దేజంబందికర్ణాటరా
జ్యబిడౌజుం డరుదెంచెఁ దా నమరవేశ్యల్వీవనల్వీవఁగన్.

మ. మృడకల్పుండు ధనుఃకలాకుశలుఁ డుద్రిక్తప్రతాపాఢ్యుఁ డీ
తఁడు వీతెంచెడు మార్గముం దొలఁగుఁడన్నారిన్ ధ్వజంబుల్తడం
బడి వాతాహతిచేతఁ జంచలత నొప్పన్ హాళి నిచ్చె సెద్రా
విడదేశప్రభుమౌళి పద్మవదనావీక్షాంబుజాతాస్త్రుఁడై.

చ. ఘనులకు జీవనంబు లిడెఁ గర్ణునకుం గొనియాడ నయ్యెఁ గ
ల్పనగముఁ బెంచె సారగవిబంధురదాహముఁ దీర్చె నౌర యీ
తనిసముదారతాగుణవిధానమటంచు వచింపఁ బౌండ్రికా
వనిపతి యేఁగుదెంచెఁ బురభామలు ప్రోలనివాళు లీయఁగన్.

సీ. చెవులవజ్రాలుమల్చినచౌకటులరుచుల్చిరునవ్వువెన్నెలల్చెనకుచుండ
వలెవాటువైచినపైఁడిదువ్వలువవన్నెలుమెయిచాయలుగలిసికొనఁగ
రతనంపుమౌళిపొరంగుకెందమ్మిక్రబోల్కందోయికెంపులు గ్రందుబడఁగ
సొగసుగదిద్దిన బుగిలిమీసముపసల్నీలంపుజాపేర్లమేలుగూడ
వెండియడ్డలపాలకినిండ నెక్కి । దంటబంటులుజంటలై గెంటజనము
రత్నగోపురరాజమార్గంబువెంట । నంధ్రదేశాధినాయకుఁ డరుగుదెంచె.

చ. కుదుసలిశేషకూర్మకిటిముఖ్యులు మొత్తముహార్తిమత్తతం
బొదివినదంతులెన్మదియు మొల్లముశైలములేదు నోచిన
న్నెన్మదలునటంచు నొక్కరుఁడ మేదిని దోస్స్థలి నిల్పఁదాల్చియుం
పొదవినయానిషాదమనుజోత్తముఁ డత్తఱి నేగుదెంచెఁ దాన్.

సీ. భోటమరాటవిరాటలాటావంతి గౌళనేపాళపాంచాలసాళ్వ
మాళవకాంగబంగాళాంగవంగకళింగసుదేష్ణపుళిందసింధు

గాంధారమగధయుగంధరబర్బరకొంకణటెంకణకురుకరూశ
మలయాళసింహళమత్స్యశకవిదేహకాంభోజభోజకేకయవిదర్భ
చేదినిషధసౌరాష్ట్రకాశ్మీరముఖ్య। భవ్యరాజ్యాతివైభవభావ్యదివ్య
సర్వసర్వంసహాభాగధూర్వహులను। హూత్సవమువంక కేతెంచిరుత్సహించి.

మ. ధరణీనాథుఁడు రాజులందఱిటు రాఁ బాదవ్వగా నేఁగిన
త్వరరీతిం గొనివచ్చి యర్ఘ్యమును బాద్యంబు న్సమర్పించి యా
దరపూర్వంబుగ నర్చ సల్పి యిరవందఱ్ క్షేమసంప్రశ్నఁ జే
సి రహిన్ స్వాహనులన్నృపాళి విడియించెన్రమ్యహర్మ్యంబులన్.

లయగ్రాహి.

అంతనిట ద్వారకనిరంతరము పెండ్లిఁడు ప్రశాంతమునివాక్యములనెంతయుఁదలంప
న్వింతయగు లక్షణహృదంతరమునందుఁగనునంతటి విధంబయిన వంతలను బొందం
గంతుఁడదనెంచుచు లతాంతశరసంతతులఁ బంతమున నేయఁగదురంతతరచింతా
క్రాంతుఁడయి స్వాంతముఁదనంతమలలించుటకుఁ జింతనమొనర్చి యెడమింతయును
(లేమిన్.

గీ. తలఁపనామనమెంతయుఁదరలిరాదు। ముదితలావణ్యసరసిలో మునిఁగెనోకొ
చాద్రులందాఁగెఁదప్పెనో యౌవనవని। నాఁగిలెనో ముంగురులవలఁదగులుకొనెనొ.

సీ. రామయురోజమురంబుఁ జేరుచుకొన్నఁ జక్రాధిపత్యంబు జరిపినట్లు
భామశరీరలతామతల్లి బెనంగ నైనఁ గాంచనలాభమబ్బినట్లు
చామకవ్వనిమోవి చవిఁజూడఁగల్గె నాదివ్యామృతాన్నముఁ దిన్నయట్లు
లేమముద్దుమొగంబు లీలముద్దులుగొన్నఁ గువలయహితకీర్తిఁ గొన్నయట్లు
వామనసుఁ జూచి బామలెగవైచినంత। నతనుధర్మంబుఁ జెందినయట్లు శ్యామ
కచకలాపంబుఁ జేపట్టఁగల్గినఘన। సంపదలు గల్గినట్లు తలంపునాకు.

క. నెలఁబోలు నెమ్మొగము నే। నెలమి నెఱుఁగకున్నయంత నెలప్రాయము పై
నెలఁతుకరూపంబెదలో। నెలకొని మెలివెట్టు నిలువ నెలవున్నదొకో.

మ. హరినీలాలకఁ దప్తహేమమయదేహం బద్మరాగస్ఫుర
త్కరముక్తారదరాజి వజ్రనఖరం దారస్మితన్విద్రుమా
ధరలావణ్యనిధిం బ్రమోదమున నుద్వాహక్రియం జెంది పు
ష్కరసౌఖ్యంబులనొప్పకం టెనిఁక భాగ్యంబన్యమేమున్నదో.

క. రమణీమణియబ్బుటయు। త్తమమే తత్ప్రేమము జరుగఁదప్పిన మదిలో

భీమమైనమలులనని నె । య్యమునం జయ్యనఁ బ్రయాణమయ్యె న్హరియున్.

క. హయహస్తిస్యందనభట । చయమాయదునాథుహృదయనరణి యొఱఁగియొం
తయుఁ గూడఁ బోఁదలఁచె నెం । చయధారాజాతథాప్రిజాయనుసట్టుల్.

సీ. జాంబూనదమయాంబరంబు దేహంబున నీలాభ్రగతతటిల్లీలఁ దెల్ప
ద్వంద్వముక్తాఫలభ్రాజిహారము మెడఁ గీర్తిలతానమస్ఫూర్తి నెఱప
మాణిక్యరమణీయమకుటంబు మౌళి మార్తాండమండలవిభాభ్రాంతి సేయ
మరకతాంగదము నమదదోస్స్థలమున ధరాపురంధ్రీసమాశ్రయతఁ జూపఁ
గరము కౌస్తుభమణిమయాభరణ మురము । దొరసి కారుణ్యరసముబ్బి పొరలు తెఱఁగు
దెలుప శృంగారరసము మూర్తీభవించు । గతిని నందాత్మజుండలంకృతులఁ గ్రాలె.

ఉ. వాహినిహాళి మైఁ బొదువ వాహనమాహితవాహనాంతరా
రోహణఁ జేసి తూర్యములు మ్రోయఁగ శీఘ్రము వేత్రహస్తసం
దోహము పాయఁ ద్రోయఁ బెనుత్రోవల ద్వారితామహాజగ
న్మోహనవిగ్రహుండని ప్రమోదమునం బ్రజ బల్కఁ బైనమై.

పంచచామరము. సరోజపత్రనేత్రుఁడంత సాగి శీఘ్రయాత్రలా
దరంబు మీఱ మార్గమందుఁ దారసిల్లు పల్లెలుం
బురంబులూళ్ళు నేళ్ళు దాటి పోవఁ బోవ రత్నగో
పురాభిధానరాజధానిఁ బూనిక డగ్గఱెల్లుడున్.

తోటకము. కమలావతి వచ్చుటఁ గన్గొని మ । ద్రమహీంద్రుఁడు హర్షముఁ దాల్కొని తూ
ర్ణమెదురొక్కని తోడ్కొని నాగరమా । ర్గమునన్ విడిదిల్లు సొరంజనుచోన్.

క. హరిణాంబక యొక్కతె కం । ధరమున నొడ్డాణమమరఁ దాలిచి కంఠా
భరణము నడుమున నిడుకొని । హరిఁ జూచెడు సంభ్రమమున నరుదెంచె వడిన్.

ఉ. కప్పురగంధి యొర్తు తమకంబునఁ జక్కిఁ గనుంగొనంగలోఁ
జిప్పిలు ప్రేముడిం దనదు చేతులఁ బూవుల దండ గ్రుచ్చుచుం
జప్పునఁ బట్టి ముంగిటికిఁ జక్కఁగ వచ్చె సుమంగళోత్సవం
బప్పుడ కోరి శౌరిని దనంతవరింపఁగఁ దెచ్చెనో యనన్.

గీ. మత్తకాశిని యొక్కతె క్రొత్తముత్తి । యములహారమ్ము నర్పఁ బళ్ళెమున నించి
పట్టి హరి రాక వినికనవచ్చుటొప్పెఁ ! దానతలఁ బ్రాలు బోయఁగఁ దలఁచినట్లు.

ఉ. అన్నులమిన్న యొర్తు కమలాక్షుసిఁ గన్గొన నేఁగిలోఁ దమిం
గన్నుల సమ్మదాశ్రువులు గ్రమ్మ నవిమ్మలనున్న కొమ్మకుం

క్రన్ననమాటుగామనమొసంగినకప్రపుటారతింగుబు
ల్కొన్నపొగంజెమర్చెఁగనుఁగోనలునెచ్చెలిచూచితేయనన్.

చ. లలనపదంబునందొకవిలాసినిలాక్షరసంబుఁబూయఁబా
త్రలరసముంచిచాఁచుమనిరాచెడిలోహరివచ్చెనంచుఁజె
ల్వలుపలుమాఱుబిల్వఁబడిఁబాత్రకయిందొలుకాదుచుండరాఁ
జెలఁగెవనంతమాడుటకుఁజెచ్చెరనచ్చుగవచ్చెనోయనన్.

ఉ. చక్కెరబోణియొక్కరితచక్కనిచక్కటిలేకపైకిఁదా
నెక్కుహరింగనంగఁదనునెక్కువమక్కువముక్కుచెక్కుమే
ల్చక్కఁగఁజూచిచేకొనెడుచక్కటినిందఱుఁదక్కనిక్కఁబో
మిక్కిలిచక్కనయ్యెననిమేలములాడిరియక్కలొక్కటన్.

ఉ. పోడిమితోడవేల్పుపువుబోఁడులజోడనతెప్పవెట్టకే
చేడియయోర్తునాడఁగనెచెన్నునఁబ్రన్ననివాఁడువెన్నుఁడీ
వేడిమిచూడ్కిమైఁదొడరవేఁగడెకూడునుదృష్టిదోషముం
దోడనెయన్నమానుపడితోఁచెడుఁబుత్తడిబొమ్మకైవడిన్.

సీ. క్రొత్తకోడలవునీవిత్తఱిరారాదుపొమ్మనియొక్కతెముందుబోవు
నటనేమియున్నదియిటులరమ్మనిలాగిముదితయోర్తుకదానియెదుటనిల్చె
నెందాకగందువాయందమునింకపోపొమ్మనియొక్కతాయిమ్ముఁజెందు
నన్యులఁగనుపట్లనైననీపోరేలయనియోర్తుఁదివిచితానచటనిముడు
నాకమునకేఁగిననువిడియాకుదప్ప । దన్నయట్టులసవతినీయడ్డయిచట
వచ్చెననిమచ్చరించియవ్వలనుబడయు । నోర్తుహరిఁగనుఁగొనుప్రియస్ఫూర్తిపర్వ.

సీ. లీలనెవ్వానికిఁగాళీయఫణిఫణాజాలంబునర్తనశాలయయ్యె
వృత్రారికృతశిలాచిత్రవృష్టికిఁగ్రేలగోత్రమెవ్వానికిఛత్రమయ్యె
శరనిధియెవ్వానికిరుచిరప్రాకారపరివేష్టితస్థిరపరిఘయయ్యెఁ
బరమబృందావనాంతరకందరములెనికిరవందఁగేళిమందిరములయ్యె
నెవ్వనికిదవశిఖిజ్వాలలెల్లమధుర । కలితమంజులనవనీతకబళమయ్యె
నట్టిగోవిందుఁడితఁడటంచుఁబ్రజలు । జతలుగాఁగూడియాడిరానమయమందు.

తోదకము. తోయజలోచనుఁదోడ్కొనిచిత్రో । పాయసమంచితభాగ్యమణీది
వ్యాయతసత్థలియందునవిల్వం । జేయుచురాయఁడుసేరెగృహంబున్.

స్వాగతము. సర్వరాష్ట్రజనసత్తములీను । ద్రోర్విపాలకలితోద్వహుమానా

ఖర్వలోచుఁదమకార్యపురీతు। ల్నిర్వహించుటలునించిరిగోష్ఠిన్.
స్రగ్విణి. మద్రరాణ్మౌళిశుంభన్మహూర్తంబుభా। స్వద్రుచిన్ దగ్గఱన్యంత్రమంబొప్పఁదే
జోద్రులంబిల్చితద్యంత్రమత్స్యంబున। క్షుద్రవీర్యంబునంజూల్పవాకుచ్చినన్.
సుకాంతి. ఘనంబుగ। న్మనంబుతో। షణస్థితిం। దనర్పఁగన్.
క. మొలఁగైజారులుమెలిసా। గలుచేతిరుమాళ్ళువిరిచికట్టులు తెలిబ
ట్టలుమిగులబుగుబుమీసం। బులువెలయఁగరాజరత్నములువచ్చిరొగిన్
సీ. వీరువారనివంతుసారించునొక్కఁడు పెద్దలున్నారనిపెనఁగునొకఁడు
హెచ్చుతక్కువలులేవిచ్చటననునొక్కఁడన్నింటఁగ్రమమొక్కటనునొకండు
కొందఱైనఁబిదపనందుననునొకండుమనమాటలాచూతమనునొకండు
ముందుగామనకేమితొందరయనునొక్కఁడందఱిట్లన్నసెట్లనునొకండు
వెడలఁబోయెదునొక్కఁడుతొడరియడలి। మగుడునొక్కఁడువడినొడల్మఱచికడలు
గనియెదునొకండొకండిదికష్టమనును। మత్స్యయంత్రస్థితినిఁగాంచిమనుజవిభులు.
పాదపము. అందులఁగొందఱనంతధృతిన్వి। ల్లందికదల్పమహామతియుంజే
తందటఁబొందకదద్దయులజ్జం। జిందరవందరఁజెందిరిలేశుల్.
ఉపేంద్రవజ్రము. ఇలాపతుల్గొందఱుహేలబాహా। బలప్రికర్షన్విలుబట్టిభాన్వ
చ్ఛిలీముఖంబంటఁగఁజేయలేకా। కులత్వముంజెందిరికొంతప్రీడన్
వంశస్థము. క్రమంబునంగొందఱుకార్ముకంబున। న్సముజ్జ్వలద్బాణమునంఘటించివి
క్రమంబుచే నెక్కిడఁగాఁదమంతనే। సమగ్రతంగాంచకసాగిరందులన్
సుగంధి. అందులోనఁగొందఱెడఁదయందుగట్టిదిట్టముం। జెందివిల్లుబట్టజాలిక్కఁ చిట్లనె
క్కువెట్టియే। మందుఁదొట్రుబట్టిమీనయంత్రమేయలేకతా। మందచేష్టద
క్కినిల్చిరంతనూర్పులేర్పడన్.
ఉ. ధారుణిపేరుపోరులనుదారశరాసనమార్గణాదినం
భారముఁబూనిపూనికనువైరులవారముఁజీరినారమ
న్నీరములాడుచున్ననృపవీరులుయంత్రవిసారమొంపఁగా
సారములేకయూరకవిచారముతోరముఁగాఁగనున్నచోన్.
సీ. నిజనాథుఁడనిచేరినిల్చినభుజగప్రభుసరూపులనఁజతుర్భుజములలరఁ
గీర్తితేజంబులీక్రియనాశ్రయించెనాఁగరములశంఖచక్రములువెలయఁ
జంద్రికారుంద్రమౌచంద్రబింబముఁబోలిమందహాసముఖారవింద మొప్ప
నీలాచలంబుపైనీరెండఁబురణించిమూర్తిఁబీతాంబరస్ఫూర్తిగప్ప

నలమృణాళప్రణాళంబునఁ గ్రొక్కి । వచ్చు మదవారణాధిపవైఖరి హరి
తాఁ ద్రొబ్బుచున్న నృపపాళిఁ గాలఁ ద్రోచి । యంత్రమత్స్యస్థలంబు డాయంగ వచ్చె

శా. నీలాంభోధరలీలఁ జానలరు నన్నీరోద్భవాక్షుం డొగిన్
పాలుం డంతట వామహస్తమున విల్బాటంబుగాఁ దాల్చి యా
కోలం గూర్చి చినారికర్ణముల కై ఘూర్ణిల్లఁ గాఁ దీసి దో
ర్లీలం గూలఁగ సేసె నొక్క మొగి ధాత్రిం డిందగా మీనమున్.

మ. యదుచంద్రుం గనుఁగొన్న మద్రనృపమేఘాంభోధి యుప్పొంగెఁ బెం
పొదవెన్ దివ్యమనోనురాగమున నృపోద్యుక్తాననాంభోజనం
పదలెల్లన్ ముకుళీభవించె వికసింపం జొచ్చె తల్లక్షణా
సుదతీలోచనకైరవంబులు తమస్స్ఫూర్తుల్ నివర్తింపఁగన్.

శా. కల్యాణంబు లొసంగు ముజ్జగములం గాపాడు దైత్యారికిం
గల్యాణంబొనరించుకంటెఁ గలదే కర్జంబు మజ్జన్మసా
ఫల్యంబయ్యెఁ బ్రతిజ్ఞ సెల్లె నని యుద్వాహంబుఁ గావింపని
స్తుల్యంబైన ముహూర్తమేర్పఱచె వృద్ధుల్ సెప్ప నోఁ డయ్యెడన్.

క. గరుడోరగచారణకి । న్నరగుహ్యకసిద్ధసాధ్యనరసురవిద్యా
ధరగంధర్వమునీశ్వరు । లరుదెంచిరి హరిపరిణయ మరయఁగనుఁగొనన్.

క. మిత్రుఁడు వెడలంగఁ దమః । పాత్రంబై తారకతతిఁ బడఁజిమ్మెడులోఁ
జిత్రగతి రాజు దానికి । నేత్రోత్పలములను విచ్చి నిల్చినవేళన్.

సీ. దశవిధనాదముల్ విశదంబులై యిట్లు మొఱయ నన్గతి వాద్యములును మ్రోయ
దేవతలమృతంబుఁ ద్రావు టే విధమన్న కరణి నెల్లరు బానకంబుఁ ద్రావ
నానందపుర మిట్టు లాహ్లాదమున నున్న దన్నటు లుత్సవాహ్లాద మొదవ
సంతతంబ రేకొందు కాంతు లిట్లుండు నన్లీలనై జ్ఞానసంచాలు వెలయఁ
బ్రకృతి నటియించు ననుమాడ్కిఁ బాత్రలాడ । నల్ల పురుషోత్తముఁడు విరాజిల్లుచుఁ
మద్రరాజపురీరాజమార్గవీధిఁ । బరమహిమఁ దెల్పె నెదురుసంభ్రమము గరిమ.

సీ. సర్వసన్నాహముల్ సమకూడెన నెగర్గఁడంత రారమ్మ లెమ్మనియె నర్త్రి
మంగళస్నానముల్ మఱి సేయుఁడనెఁ గణ్వుఁ డాలస్యమింకేమి యనియె శుకుఁడు
సుముహూర్తమది డాసెసుమ్మనె దమనుండు వాలఖిల్యుండిదే వేళ యనియెఁ
గౌశికుండింకొక్క ఘటికకాలంబనెఁ గుంభజుండెలమి బుక్కులు పఠించె
వ్యాసుఁడనయోశ్శుభోదయమస్తటనియె । సకలవైవాహికక్రియాసముదయంబు

జరుగవలెముందుమందంబుచనదనుచువ। శిష్ఠనారదముఖ్యుల్వచించిరంత.

క. చంపకనాసయొకర్తుని । లింపవరావరజునకుఁజలింపకతలపై
నింపునసంపంగినూనియ । నింపుచుఁదలయంటెమురిజనింపఁగనంతన్.

సీ. సంకుమదకుంకుమామలచందనములఁ । బంకజాక్షునకొక్కశశాంకవక్త్రి
మార్జనమొనర్పఁజక్రియమరెనవరస । విభవమొక్కటమూర్తీభవించెననఁగ.

గీ. వారిజాక్షియొకతెసారంపుహిమవారిఁ । ద్రిమ్మరింపఁజక్రిదివ్యమూర్తి
చెలువుమీఱెవిశదశృంగారరసముపై । వెల్లివిఱియుసరసివిధమెలర్చ.

గీ. వాలుగంటియోర్తుజాలువాచేలగో । పాలమౌళిమెయిసలీలనిడఁద
మాలసాలమలముపాలాశవర్ణవి । శాలవల్లిహేలఁజాలఁదెల్పె.

గీ. మేదురాలంకృతుల్దీర్చిసోదరసము । నాదినవరత్ననీరాజనాదివైభ
వోదయంబులుగదురదామోదరుఁడుక్క । శోదరులనూదియుద్వాహవేదిఁజెందె.

క. అంతటనుమ్రథధరణీ। కాంతునికూతురినిమిగులఁగైసేయఁగన
త్యంతానందాక్రాంత । స్వాంతంబులనేర్పుమీఱనమకట్టిరొగిన్.

ఉ. చామనొరత్నసానుతటసంస్థితయౌశచిసాటిఁజాటెదా
హేమమహనీయమీమణిమయాసనసీమవసించుమంచుఁదా
సామజయానయొక్కరితసంపగినూనియనించిచేమురిన్.
భామశిరంబుపైనమరఁబ్రామెనుమేనసియాడవేడుకన్.

గీ. అంగనామణిమృదులాంగమందుఁ। గుంకుమంబునసంకుమదంబునమర్చిశోభ
నాంగియోర్తుకనలుఁగుఁబెట్టంగడంగి । పుష్పితపలాశతరుశాఖపోల్కిఁబొల్చె.

ఉ నీరజపాణియోర్తునవనీరదవేణిశిరంబునందునిం
పారఁబరీమళప్రస్పమరామలకంబిడిరుద్దిహైమవాః
పూరముఁద్రిమ్మరించిచెయిఁబుల్మెడుపోలికదెల్పెవారిము
గ్వారముఁబూర్వరుద్ధకచవైరమునారసినీరొనర్చెనాన్.

గీ. మెఱుఁగుమెఱుఁగులనొఱయునెమ్మేనిపైశు । భాంగిచెంగావిచీరహత్తంగఁజేసె
మాధవాగమమునసమ్మదాధికాప్తి। నుల్లసిలిపల్లవితమైనవల్లరిగతి.

చ. ఒనరమహామహీధరపయోధరయోర్తుకగబ్బిగుబ్బల
న్వనముసమోపుచుందనప్రవీణతయేర్పడవాలుగంటికిం
పెనయఁగఁగీలుకొప్పఘటియించుటజానలరారెఁజూడఁజం
దనతరుకోటరంబునకుఁదారెడునీలసరీసృపంబనన్.

ఉ. సుందరిమొక్కతందమగుచుందనరారెడుమందగామినీ
సుందరఫాలభాగమునఁజోద్యముఁగాఁగమ్మగిమదంబుచే
తందిలకంబుఁదీరిచెనుదారవిభాతతిచేనమందమా
చందురునందుఁగందిదియచందమటంచునుదెల్పనైవడిన్.

చ. తమమునువారివాహములుదార్కొనునంతనసూర్యచంద్రకాం
తిమహిమడిందునన్నడిఁదీర్చుకొనందలపోసిలోననీ
రమణితమోఘునాభకచరాజితశీర్షమునందునిల్చిర
న్కమమునసల్లసిల్లెఁదనిరామలమర్చినసూర్యచంద్రులున్.

గీ. ముదితమొక్కతెసుదతికిముత్తియంపు। గుదులపాపిటబిందీలునుదుటఁబొదివె
ముదిరసముదయమదనెంచిముదముగదుర। నుదకబిందువుల్జదిపెడుకుదురుబాదవ.

క. కమనీయవజ్రతాటం। కములుచెలువచెవులఁగూర్పఁగనుపడెమరుఁడీ
కమలవిలోచనదృక్చర। సమితిఁబదునుసేయనిడినశాణములనఁగన్.

గీ. లలనలాయ్యానవియదవలగ్నకటిప। యోధరంబులరాపిడికోర్వలేక
నడుముజవ్వాఁడునననిల్వనిడినపట్ట। మనఁగననుపైడియొడ్డాణమందమొందె.

సీ. పంచాస్త్రవిజయాబ్జబంధంబనఁగఁగంధరమునగ్రైవేయకమమరఁజేసి
కందర్పుదుగసంకలితశ్రేయమనాజఘనమునపైవజ్రమేఖలఘటించి
యతనుజయస్తంభభృతలిఖినాఘుజాస్థలినిరత్నాంగదములనమర్చి
కాముసింహాసనకలితదామములననురమునముత్తెంపుసరులవైచి
శంబరారాతివిజయవిస్ఫారబిరుద। ములనఁబదములహంసకములనుగూర్చి
భావనంభవవైభవప్రాభవంబు। భాతిఁగ్రైసేసిరబలల్వినీతినాతి.

ఉ. సారసనేత్రియోర్తుఘనసారసమంజనసారభావ్పతో
దారపటీరకర్దమముఁదన్వివయోధరసీమఁబ్రామశో
భారమణీయవైఖరివిభాసిలెమైత్రియొనర్పఁబేర్మితో
వారకదారసిల్లుహిమవద్రజతాద్రులమాద్రిదెల్పుచున్.

ఉ. రాగరసంబిదేలమదిరాగరసంబదెపొంగిపార్లనా
రాగజగామినీసరసురాలవునీవనవచ్చుఁబ్రేమనా
పైఁగలదేనిపాదములఁబట్టుమునాథయటంచుఁదెల్పనిట్
లాఁగదె? యంచునోర్తువనితాంఘ్రులలాక్షరసంబుఁగూరిచెన్

చ. సునియతినర్కియల్వాలయశోభనవృత్తులతోనలంక్రియా

గణరసకల్పనల్మెఱయఁగాఘనశబ్దములుప్పతిల్లల
క్షణమహిమంబుమీఱియలకావ్యకుమారికరీతినంతల
క్షణయరుదెంచెనమ్మదమెసంగఁగఁబెండిలితిన్నెచక్కికిన్.

మ. జయసీనాంకుఁడుభూమిభృద్ధ్రుతిఘనాంచద్ఘృష్టిమర్త్యద్విపా
రియశోఖర్వుఁడుశౌర్యభార్గవుఁడులక్ష్మీరాముఁడుద్యద్బలుం
డయివర్తిల్లెడికృష్ణమూర్తికిఁబ్రహర్షాప్తింబ్రహత్సేనుఁడెం
తయులక్ష్మీస్థిరమణీయరూపఁదనుజాతంధారవోసెందయన్.

ఉ. అంగజభంగసంగతులయంగుపాసంగఁదొలంగునింకనో
యంగనరోకచుంగొనుమియంగజతాపముమెట్టునట్టిమ
మ్మంగలియంగభీతివిడుమంగలిరక్షయిదన్నకైవడి
న్మంగళసూత్రముంజతురిమంగళసీమఘటించెశౌరితాన్.

చ. బలుతెలిముత్తియంపుఁదలఁబ్రాలుతలందలమొప్పనింపుసొం
పలహారిమంగళోత్సవమహామహిమంబుఁగనుంగొనంగుతూ
హలులయిసాహసంబునవిహాయసచారులుద్రిమ్మరించున
య్యలరులవానసోనయననందముఁగాఁగననయ్యెనయ్యెడన్.

గీ. పూర్వముధనంజయునిస్నేహపూరమునమ । హాభ్యుదయమందఁజేసెపైదైత్యారితొంటి
తీరునధనంజయునిస్నేహపూరమునమ । హాభ్యుదయమందఁజేసెనిష్టబ్బురంబె.

చ. మహిళసదంఘ్రిశ్రీహరిసమంజసహస్తమునన్గ్రహించిపె
న్రహినుపలంబుఁద్రొక్కఁగనొనర్చుటఁజూచిమహామహోపలో
గహతినిగందెఁబాదమనిగాకరమార్జనసేయునీయనూ
ద్వహుఁడెదమోహమేమనుచుభామినులాడిరిహాస్యవైఖరిన్.

చ. హరిహరిణాక్షియున్నమనమంచితశయ్యవసించియీశుఁడీ
శ్వరి, శతపత్రశాలిశచి, సృష్టసరస్వతి, హేళిఛాయ, భా
స్వరతరపుష్పధన్విరతి, వాసినెసంగియొసంగిరంతబం
ధురవసుధాసుధాశనవధూవరకోటికిగంధవీటికల్.

ఉ. వేదవచోనినాదములువిశ్రుతమంగళతూర్యవాద్యము
ల్రోదసియందుఁగ్రందుకొనిమ్రోయఁగసభ్యులుప్రాభవోస్తు, రా
జ్యాదికమస్తు, శాశ్వతయశోతిశయోస్తు, చిరాయురస్తు, ధీ
రాదరమస్తు, వా, మిహ, తథాస్తని, దీవనలిచ్చిరెంతయున్.

ఉ. అంతటఁగుంతలాంధ్రమగధాద్యధినాథులుసైంధవద్విపా
నంతమణీవిభూషణగణాంశుకముల్బదివించిరిట్లుతా
జ్యాంతరవైభవంబితనికర్పణమౌననుభావిసూచకో
దంతముచూచుదిక్పతివితానమనోంతరవీథిఁదోఁపఁగన్.

చ. మొరసెనుదేవదుందుభులుమోదమునన్విరివాననిర్జరు
ల్గురిసిరికిన్నరుల్స్వరసకోమలగానమొనర్చిరప్సర
స్తరుణులునాట్యమాడిరిప్రశాంతవిహారమహానుమోదభూ
మరుచిరుఁడైసమీరుఁడుసమంజసరీతినివీచెనెంతయున్.

సీ. జాజులపాట్లంబుసాటిశాల్యన్నంబుఁగుందనపుంజాయకందిపప్పుఁ
దినఁగంతరుచులుదప్పనిపిండివంటలఁబరమామృతముఁబోలుపాయసంబు
జిహ్వాకచిగురించుచిట్టావబజ్జులఁదేనెపాకముతీరుతియ్యబులుసుఁ
గప్పురంబనఁదావిగ్రమ్ముకమ్మనినేతిఁజక్కెరగడ్డబోల్చుక్కపెరుగు
షడ్రసమ్ములువిలసిల్లఁజట్లలోన । ఘుమ్ముఘుమ్మనఁబొగిచినకూరగుంపుఁ
గొనరిభుజియించిరతితృప్తిపొసఁగపంక్తి । వీరువారనకయొపెండ్లివారుజేరి.

క. గరుడోరగసిద్ధమునీ । శ్వరముఖ్యులుపరమహర్షభరితాత్మాంతః
కరణులయిసరభసంబున । సరసవచశ్చాతురీప్రచారంబెసఁగన్.

గీతగర్భితోత్సాహ. సరసనీరజాతనయనసద్వనీవసంతభూ
భరణపత్రిరాజతురగభవ్యపావనాఖ్యమా
నిరతహాటకాచ్ఛవసననీరదాభదేహస
చ్చరితవాసుదేవవిబుధజాలవంద్యబ్రోవుమీ.

కందగీతగర్భితచంపకము. కరివరదానధీవిజితకంసరమాప్రియవేదవేద్యశం
కరవినుతాహ్వయాసకలకారణభాస్కరభూరితేజదు
స్తరదురితచ్ఛిదాగుణనిదానరసాంచితగోపవేషన
వ్యరుచిఘనాఘనావిబుధవారవశంకరవిశ్వపాలనా.

రథబంధకందము. శ్రీశారాత్రించరమద । నాశావిధుచంద్రికాద్రినాయకరుద్రా
హీశయశోవారామా । నీశార్చితభూరివేషహేమాగధృతీ.

గోమూత్రికా. ఖడ్గ, పుష్ప. బంధకందము. ఘోరనరవారవారా
సారదరీనరహరిహరశరనరసారా
తారధరధీరమారా

కారహరీవరగిరిధరకరసారభరా.

విద్యున్మాల. మారాకారామారాధ్యశ్రీభృ। ద్ధీరాసారీధీరాధారా
పారావారస్ఫారాగారా। సారాచారాసారాశౌరీ.

ప్రమితాక్షరి. నరసారథీనయనారదగా। నరతాశరీరజితనారదమా
వరయుద్ధరంగరిపువారదరీ। వరనామఘాతహతవారదరా.

పృథ్వి. నీలకంఠేంద్రవాణీపవంద్యాజగ। త్పాలలేఖర్షభప్రాభవాభూభవా
ఖేలనాలోలసత్కీర్తిదివ్యప్రభా। జాలసంక్షాళితాశాప్రదేశాంతరా.

శా. నీచాతుర్యము లెంచమావశమె? తండ్రీ! నిర్గుణబ్రహ్మరూ
పౌచిత్యంబుననుండుసీవునగుణోద్యద్రూపసంఘుంబులెం
తోచేపట్టిచరించు టెల్లఁబ్రజదుర్దోషంబులంద్రోయలీ
లాచారిత్రలానర్పఁగాఁజుమివినీలా! భక్తచింతామణీ.

భద్రకము. అంచుఁజిత్రతరక్షితి। న్నెంచిసంస్తుతిసేయుచుం
గాంచనాంబరునానతిం। గాంచియేగిరియెల్లరున్.

మ. మరునాడంతఁబ్రభాతవేళఁగొలువై మద్రావనీనాథుఁడా
దరమారంగనిపెండ్లివారలకునుద్యద్దివ్యజాంబూనదాం
బరసందోహముఁబారితోషికముగామన్నింపసంతోషబం
ధురులై వారలుకన్యఁబంపుమనితోడ్తో వేడఁగాసమ్మతిన్.

సీ. నిద్దంపుమగఱాలనల్వటద్దంబులందంపుబంగారుగందంపుగిండ్లు
పవడంపుఁగోళులపట్టెమంచంబులుపచ్చలుదాపినపల్లకీలు
ముద్దులుగా ఱెడునుకాళ్లకాలిపీటలునిగ్గులుదేరుమానికపుసొమ్ము
లెంచిహూర్పించినమంచిముత్తెపుఁబేరులడరుమేలిమితమ్మపడిగములును
దివ్వెగంబాలుకుర్చీలుదిండ్లువిలువ। పట్టుపరుపులుచలువదువ్వలువపెట్టె
లాదిగాసర్వవస్తువులరణమిచ్చి। కూతునల్లునివీడ్కొల్పెఁగూర్మినోడు.

ఇంద్రవజ్రము. మందప్రయాణంబులమెచ్చిచెల్వతో। నందాత్మజుండంతటనవ్యమా
నసానందమ్మునుంబొందుచునైజపట్టణం। బందుంబ్రవేశించెడునాస్థఁబోఫుచోన్.

సీ. ధరణినీచామహత్వంగతాయసుటలికాలంబునందతారాణమయ్యె
గొల్లవానికిసంతకొట్టమేనేమన్నసామ్యమిచ్చోటనెసాక్షియయ్యెఁ
దలఁపఁగవిధిరహూబలవాననెడిబుధవచనమిప్పట్లసంభావ్యమయ్యె
ఘనతరోద్యోగంనకారణంపుంసామదృష్టమేవహియంటదృష్టమయ్యె

సాహసీలక్ష్మిశ్రయనుటింతఁజక్కనయ్యె । ననుచుమదినీర్ష్యనొందిచయ్యననశక్తి
దుర్జనత్వముగన్పట్టఁగొంటినృపతి । వితతియదుసాధుపక్షముఁగ్రొవ్వియరికట్టి.

సీ. అంభోరవంబులసంభారములుగావుగంభీరభర్జనహుంభరములు
చెల్లబోనీయాటచెల్లింపనలవెట్ట్రిగొల్లలుగారుభూవల్లభాధ్య
లాలమందలమలదోలుటగాదుభూపాలలీలాబల్లపాళిగాని
బృందావనముగాదుచిందులుద్రొక్కనమందప్రథనరంగమందిరంబు
చెట్లఁబడఁగొట్టుటాకాదుచిత్రమైన । చాపనైపుణిపూనికఁజూపుటసుమి
వెన్నముద్దలుగొనిచోరవృత్తిఁబారి । పోవుటోకాదుమొననిల్చిపోరుటంచు.

ఉ. కట్టలుకన్మృగేంద్రునరికట్టుమృగంబులరీతినగ్నిపైఁ
జుట్టుపతంగబృందములచొప్పునఁదార్క్ష్యునినడ్డుపెట్టిక
న్పట్టుభుజంగపుంగవులభంగినిమీనము నేయలేనిరా
పట్టులునట్టెయిట్టెచలపట్టియదూత్తముఁజుట్టుముట్టినన్.

సీ. పెనుసటాఝాటంబుఁబెళకినరేగుసింగముబొబ్బరించెడుగతిని గేరి
ప్రళయకాలంబునభైరవాకారంబుఁగనునుగ్రమూర్తియైగదనుద్రిప్పి
గ్రీష్మర్తుభాస్కరభీష్మఁడైకన్గొననల్కనుల్కాజాలమల్కరాల్చి
చరణతాడితకృష్ణసర్పంబుమాడ్కిరోషావేశముననుస్ఫురనుచురోఁజి
యెదురుకొననుబ్బుబెబ్బులియుకుటిఁజెంది । పండ్లుపెటపెటఁగొఱుకుచుఁబరవశమున
యాదవోత్తముఁడండఱకన్నిరూపు । లైజగదతీతవిక్రమాభ్యాసవృత్తి.

సీ. పరిఘాదిసాధనప్రహరణదురహితగహనంబునకుదవదహనమగుచు
సమశరాసారవర్షకవైరినీరదవారంబునకునుసమీరమగుచు
మండలాగ్రావృతమండలేశాబ్జమండలమునకిందుమండలమునగుచు
దోర్దర్పయనైపుణ్యధూర్తరాజమృణాళకలనంబునకుఁగరికలభమగుచు
బంధురాస్త్రప్రయోగవసుంధరాధి । నాథధరణీధ్రములకుద్యనాథుఁడగుచుఁ
జెండిచెండాడెనరులదోర్దండమహిమఁ । దనరిహరిమంచుఁద్రోచుమార్తాండుమాద్రి.

మ. అవలీలన్యదుమౌళినూపఱికునత్యాశ్చర్యమాహ్లాదమొం
దువిధంబైవనితామణిందవిలివాతూలంబుతూలంబున
ట్లవనీపాలబలంబుఁదోలిజయనిర్హ్రాదంబుదిక్భిత్తులం
దవులన్శంఖమునొత్తినైజనగరింద్వారావతిఁజేరఁబోన్,

ఉ. కూర్చిరిగోపురంబులనుగోమలపల్లవతోరణంబులం

జేర్చిరిమిన్నుముట్టఁగవిచిత్రమరుచ్చలకేతుజాతముల్
తార్చిరిశుభ్రవిభ్రమసుధాస్థితిమౌక్తికరంగవల్లిక
ల్పేర్చిరికాయమానపటలిన్సవితానముగంబురప్రజల్.

సీ. కటితటసంబద్ధకనకాంశుకాంశుకప్రకరంబునీరెండఁబర్వఁజేయఁ
గౌస్తుభమణికిరీటాస్తోకరుక్తతికపటసంధ్యారాగగరిమఁదాయ
నెమ్మేనినీలంపునెఱినిగన్నిగలుదిక్తటులందుఁగటికచీకటులువోయ
మందహాసప్రభాకందళంబులుజిందితెలుపారుపండువెన్నెలలుగాయ
నాయతవిలోకనద్యుతులావరించి। పుండరీకప్రకాండంబుపుట్టఁజేయ
మహితమహిమలహర్నిశల్కలయద్వార। కాపురంబుఁబ్రవేశించెఁగంసవైరి.

ఉ. సీరిసహోదరుండుతనసేనలతోవెలియేన్గునెక్కి—పూ
ర్నారులదృష్టిమైనోలయనాగరవీథినిరాఁజనెన్సర
ల్వారకగొల్వనభ్రకరిపైనివసించినసహస్రనేత్రసం
భారముఁబూనినైజపురపద్ధతినేఁగెడియింద్రుచందమై.

ఉ. నీరజనేత్రురాకఁగనినీరదవేణులుసౌధవీథులం
బారులుదీర్చియుండఁగనవారిగవారలకొప్పుచూపులొ
ప్పారెనుదానుపౌరజనులట్లుపురేందిరలోనికూరిమిం
దోరపుఁగల్వతోరణముఁదూర్ణముపూర్వముఁగానొనర్చెనాఁ.

మ. విబుధాసేవ్యముసిద్ధగీతకలనాన్వీతంబుసౌవర్ణరు
జ్నవిడంబంచితరత్నకూటముశుభోన్నిద్రాద్యశబ్దావళీ
ప్రబలంబైనసుమేరువోయనెడిభాస్వద్వేశ్మముంజేరెఁదా
నబలాయుక్తముఁగాఁదటిద్యుతఘనంబైశౌరివిస్ఫూర్తిమై.

సీ. జగతీజనారాధ్యసర్వజ్ఞులకుసర్వమంగళావాప్తిసమ్మతినమర్చి
లలిరాజహంసమండలమునకువిరాజితాంబరసంగతినాదరించెఁ
గవిబుధగురులసంఘాతంబునకుసురఃకాంతికలాపంబుఁగలుగఁజేసెఁ
బ్రత్యర్థిపటలికిఁబ్రస్ఫుటహేమవిభాసిదానంబుసుబ్రతిభఁగూర్చెఁ
బరమగోత్రోద్భవులకునునిరతభాస్వ। దమితరత్నాకరప్రాప్తినాచరించె
విస్మయావహవితరణవిదితుఁడైయ। దూత్తముఁడుతద్గృహప్రవేశోత్సవమున

ప్రభువృత్తము.

కుముదనయనఁబెనఁగొనుమోదముహ్యా। త్కమలపుటమునసుధనరన్యదుచం

ద్రముఁడు శుభదమొకరమణీయముహూ । ర్తము వినిత మిని బుధవితతిచేతన్.

సీ. ఖర్వాలనైననఖర్వాలఁ గాఁజేయు దర్పణద్యుతులసందర్భమొనసి
జనమోహతమముఁ దీర్పను జాలునవరత్నసంతానదీపికాసరణి మొనసి
కంతుక్రియాక్లాంతకాంతాశ్రమాభికృంతనయంత్రతాళవృంతములఁ దనరి
పరమహర్షరసంబు నెరపుకాలాగరుపరిమళధూమధూపములనమరి
చతురబంధానుబంధాంగజాతశాస్త్ర । సకలమర్మోపదేశదేశికవరేణ్య
చిత్రపాంచాలికలు గల్గి చెలఁగు భర్మ । మణివినిర్మితనర్మహర్మ్యమునకరిగి.

ఉ. వేలుపుఁజేనినీలముల వ్రేలెడిపట్టెలనిగ్గుముత్తెపు
జాలరులందు వ్రేలురతనంబులబంతుల మేలువజ్రపుం
గోళులఁ జాలువారియదిగొబ్బునఁ జెంగలువంపుఁదేనెలం
గ్రోలెడు తేఁటులం చుఁదమిఁ గొల్పెడు సెజ్జవసించె శౌరితాన్.

ఉ. అత్తఱిమత్తకాశిని యనచ్యుతు నిందనుఁ గూర్పఁజేయు నా
యత్తముఁ జూచి తత్తరము హత్తినజంత్రపుబొమ్మపోల్కి యు
వ్వెత్తుగఁ బెన్గులాడె మొగమెత్తక వ్రీడఁ గడంకబిత్తరు
లున్మత్తమరాళయాన బతిమాలఁ దొడంగిరి బుజ్జగింపులన్.

శా. తల్లీ యేల నెత్రుక్కెదీపువలవంతం జెందియున్నాళ్ళరో
కల్లన్ జోళ్లను బాడినట్టిపతి వేడ్కన్ వచ్చి లోముళ్ళపై
వెళ్లం ద్రోయఁగ మల్లెపూవుతగవే పెక్కేల నేయిట్టివా
రెల్లంగాదె నిజాధినాథవశలై యిల్లెక్కువారిమ్మహిన్.

ఉ. ప్రాయపువాసనవ్వలపు పాల్పడి నాథుఁడు రాని నాడు రాఁ
డాయెను డాయ నేమి మరుఁ డాయనివచ్చినయంత నేమియ
న్యాయమొ లోనలోసాలపునఁ ద్విప్రయాసము సేయుచుండ రా
హా యువతుల్ గయాళులనునట్టి ప్రసిద్ధులు దీననే సుమీ.

మ. సుదతీ నీపతి చేయుచేఁతకు బదుల్పొంపొందఁ గావింపకుం
డెదు సుమ్మీ మగడామమాట పరిపాటిం బట్టి చాతుర్యమిం
పొదవం బల్కుమి భర్త భావమొదలో నూహించి యాముచ్చట
ల్పొదలం జేయుట నాయమో మదవతీ మోహాతిరేకంబునన్.

మ. అని సాధూక్తులఁ దెల్పి యాలలనలా య్యంబంటులు గ్రాపరా
ధుని బోనీయక పట్టుమాడ్కి నెలఁతం దోడ్తోడఁ జేపట్టిచ

య్యన విశ్వంభరు నోలనిల్పి రిప్రసూనాస్త్రుం డొరం దూసి యొ
య్యన సానంబదు నిట్టయూరవశరంబన్నట్టులు ద్భాసిలన్

చ. కదిసె ముహూర్తవేళ ఘటికల్ గణియించెద నేలరా దొమా
మదవతిఁ జూచి వచ్చెదను మంగళవస్తువులుంచ లేదొ తె
చ్చెదఁ బనియుండెఁ బోయెదని సీ యిదె యాదికి వచ్చెనంచుఁ ద
న్పదతులు కన్నొగ్గలించనఁ జొచ్చిన సామజెపిగ్గు వామకున్.

ఉ. అయ్యెడఁ దియ్యవిల్తుఁ డెదనయ్యదు చంద్రుని వ్రయ్య జేఁయఁ గాఁ
జయ్యనఁ దొయ్యలిం దనదు శయ్యకుఁ దీయఁ దలంచి జాలువా
పయ్యెద నొయ్యనందిగువఁ బాయని సిబ్బితి మూయఁ గంబమం
దుయ్యెల లూగు నల్లమున నుండెడు నెయ్యము తియ్యమెట్టిదో.

చ. మనమున సంభ్రమం బొదవి మానిని నీ బొమవిండ్లు జంఘుల
న్దొనలును జూపు తూపులును గోరపుటూరువు బూరలుం గళం
బను జయశంఖముం బొలుపుటారను వాలును గల్గి కామశ
త్రుని సెఁబరిమూర్ప నున్నమదిఁ దొ్రటిలఁ జేయుదువే మెసెచ్చెలీ.

సీ॥ చిలుకల కొలికి నీ పలుకుల యమృతంబు లాలుకనోయనియే మొ పలుకఁ బోవ
బాలనీ మెయి జాలువానీరు దోలఁకు నోయనియే మొ చెంగటకైన రావు
పాలఁతి నీ కంగోయి తళుకులు మిక్కిలి బెళుకు నోయనియే మొ నిలిచికనవు
వెలఁది నీ చిఱునవ్వు వెన్నెలల్పలుక బాఱెడు ననియే మొ పెంపడరనగవు
పడఁతి నీ యౌవనధనంబు పరులపాలఁ । బడునొయనియే మొ నిండఁ గన్పడవు నీవు
కలికివగుదని గడియించె బలిమినంక । పాళిఁ జాలవి రాళిగో పాలమాళి.

సీ. నీనవ్వు వెన్నెలల్నె అపి నా మోహాంధకారంబుఁ ద్రోయవే కలికి మిన్న
నీ మధురతరాధరామృతమిచ్చి నా దాహంబుఁ దీర్పవే తలిరుబోణి
నీకుచకుంభంబు దాకొల్పి నా తాపజలధి దాటింపవే జలజగంధి
నీవచోఘుటికల నిండించి నానస్మరజ్వరము వారింపవే వాలుగంటి
నీముఖేందుని జూపి నా నేత్రకైర । వముల వికసింపఁ జేయుమో కుముదనయన
యనుచుఁ బలుమారు గోరి యయ్యబలఁ జేరి । యనఁగి పెనఁగొనె శౌరి నెయ్యంబు దారి.

సీ. తారహారముఁ జిక్కుఁ దీరుచు తీరున నారిచనుంగవ గోరు నాటి
ఘర్మాంబువుల మీటు కైవడిఁ గ్రొల్గంటి చెక్కుటద్దంబులఁ జేని మిర్చి
మృగమదతిలక పరిమళ మాఘ్రాణించు పోల్కి ముద్దియ మోము ముద్దులుగొని

యితరేతరశరీరగతిపరీక్షకరణిఁ దనుమధ్యతనువుతోఁ దనువు నొఱసి
చక్కఁబయ్యెదసవరించుసరణిఁ దరుణి। బాహుమూలము గిలిగింతఁ బఱపి యొలమి
మెఱసి శృంగారచేష్టల నెఱపి మోహ। నాంగి మనమును రాగికరంగఁ జేసె.

గీ. వలచివలపింపనేర్చెడువలను దెలిపి। కఱఁగికఱఁగింపఁగల్గెడుకరణిఁ గఱపి
రతులనుపరతులెనయునిరతులనేర్పి। గాఢమూఢతఁ దగుచేడెఁ బ్రౌఢఁ జేసె.

గీ. పతికిహితరీతి నెంతయు నింపతికియధర। ఫలముఁ జవిఁ జూపి మేనుసఫలము గాఁగ
నీవిశాలాక్షి యిడెఁ గడు నీవిశాటి। వలఁతియైనంతరతులఁ బ్రోవలఁతియగునె

మ. పరమప్రీతిమురారిలక్షణ నెలర్పం బొందియుంటల్పర
స్పరచిత్తానుగతానురాగలతయొప్పంజుట్టెనో? యిట్టు, లి
ద్ధరభార్యాపతులిద్దఱేకమను వార్తల్దెల్పుటో? కాక యీ
వరుసంభాషిలు టెట్టులంచు సరసుల్వాక్రువ్వఁ బొల్పారెడున్.

సీ. జాలువావలువలచాయలు మెఱుములు తొడవులయులివులు తొలియఱుములు
గళరవంబులు భేకఘనతరకూకృతుల్ ఘర్మధారలు జలకణగణములు
నఖరాతిరేఖలు నాగేటిచాళులు దంతక్షతములంకురాంతరములు
కస్తూరికాచర్చవిస్తారపంకంబు విడివడుముత్తెంబులడరుకరక
లరవిరియబాఱుకురులు మేలైన నెమ్మి। పురులుగాఁగ వధూవరాపూర్వయోగ
సరణి హర్షానవర్షావసరముఁ బోలె। నమరు మోహంపు మబ్బు పెల్లావహింప.

సీ. నెలఱాలవెలయుతీనెలరాజిలెడుపూవుగొప్పచప్పరములఁ గొంతదడవు
జాలువామేలిమిజాలువాఱెడుసౌధసంతానములయందుఁ గొంతదడవు
ఘనసారసపరాగఘనసారశకలాతికోమలస్థలములఁ గొంతదడవు
కృతకధరాధరకృతకటకప్రదేశాంతరంబులయందుఁ గొంతదడవు
లాలితోద్యానశుకకోకిలాలిరుతని। కుంజపుంజంబులందును గొంతదడవు
సతిపతులు నిత్యము రమావసతిగ నతను। రతులఁ గతి గేలి నొనరింతు రతులరతుల.

సీ. ఘర్మంబునను గంధకస్తూరికలు జారఁ గట్టుపట్టులు వీడి కడకుఁ జేర
రతనంపుఁ బేరులజత లెల్లఁ బెనగాడఁ గాలు సేతులు నట్లు కలియఁ గూడఁ
గేశపాశంబులు కెరలి వీడ్వడి రాన వెనువెంటఁ బూవులు పిదిలి రాల
నుస్సురుమను నూర్పులుత్తాడ నాసికపుటముబ్బఁ బార్శ్వంబులటులనుబ్బ
బ్రణయములఁ జిక్కి రత్యుపరతులఁ జొక్కి। సౌఖ్యములనందిహర్షరసంబుఁ జెంది
ప్రక్కలను బొంచి పాన్పనఁ బవ్వళించి। సొగిలి నిదురింపుదురు రేలు మగడు నాలు.

మ. జయభేరీనినదంబు చేఁ బరివరీశాంతప్రబోధానువా

క్ష్వయసంబోధనచేనుషఃపవనసంచారంబు చేసెంతలో
దయవేళాంచితవందిసంస్తవము చేఁదల్లకృష్ణులెం
తయుసేలాకృంచిసుఖంబుఁగాంతురతితాత్పర్యంబుతోనిత్యమున్.

సీ. రుక్మిణీవక్త్రాంబురుహహరిదశ్వుండుసత్యావధూవనచైత్రకుండు
జాంబవతీమానసనరసీహంసంబు కాళిందికానేత్రకైరవశశి
భద్రామనోరథవ్రజసస్యమేఘుంబు నాగ్నిజిత్తపోనవ్యఫలము
లక్షణాప్రేమలీలాలతావాలంబుమిత్రవిందోష్ఠబింబికశుకంబు
షోడశసహస్రకామినీసురుచిరప్ర । సూదరసనిర్మలోర్మికాంభోధియైన
చక్రిదివ్యచరిత్రలశాంతభక్తిఁ । జర్చసేయంగఁజిత్తవిశ్రాంతిగలదె.

చ. నిరుపముఁడున్నిరంజనుఁడునిత్యుఁడుసత్యుఁడుశుద్ధుఁడుంబరా
త్పరుఁడసురాళిఁద్రుంపఁగనుదారసురప్రకరంబుఁబ్రోవఁద్రి
మ్మరునవతారభేదములమర్త్యగతింబనిఁబూనికానియా
హరిచరితంబులేవిధినైననెఱుంగఁదరంబెయేరికిన్.

క. అనిరోమహర్షణాత్మజుఁ । డనుతర్షముతోడశౌనకాదిమహర్షుల్
ఘనహర్షోత్కర్షముఁగన । ననువేర్పడఁదెల్పెలక్షణాపరిణయమున్.

చ. గరిమనుశాలివాహనశకప్రథితాజవియద్ద్విపక్షపే
శ్వరగురుసంజ్ఞరాజిలెడిసర్వజిదబ్దతపస్యకృష్ణప
క్షరుచిరసప్తమీతరణిఘస్రమునాటికిఁబూర్తియైనయీ
చరితముసెల్లునారవినిశాకరతారకమైథరాస్థలిన్.

మ. త్రిజగత్కారణసద్విచారణసదాధివ్యాధిసంహారణా
సజలాంభోధరదేహధారణసుధాసారాంచితోచ్చారణా
కుజనానీకవిదారణాప్రవిలసద్గోవర్ధనోద్ధారణా
గజరాజాతివిపన్నివారణపతద్గంధర్వసంచారణా.

క. దాశరథివినాశితసమ । దాశరథిషణాత్తమారుతాత్మభవయశః
కాశప్రసవశరన్నిధి । కాశప్రసవక్రియానుగతకుశికసుతా.

వనమయూరము. కాండరుహరాగమణికాండఘృణిరాజ
న్మండనమదాంధరిపుమండలవిభేదా
ఖండభుజసారవిధుఖండధరభావో
ద్దండనిజనామహృతదండధరబాధా.

గద్య. ఇది శ్రీమన్ముకుంద పదారవింద మరందాస్వాదనాసాదిత దీపితకవితా
వైభవ శృంగారకవి పల్లయామాత్యతనూభవ వివిధకథావిధానాధీనసు
ధీవిధేయ సర్వారాయాభిధేయ ప్రణీతంబైన లక్షణాపరిణయం
బను బంధుర ప్రబంధంబునందు సర్వంబుందృతీయాశ్వాసము.